వేసవిలో చల్లదనం
మీ సౌందర్యానికి
మరింత చక్కదనం
'గాంధిటెక్స్'
చీరెల సముదాయం!




మీరు కొనే ప్రతి చీరపై
ఈ లేబుల్‌ను
గమనించి కొనండి!

గాంధిటెక్స్ ©
కాటన్ శారీస్

అన్ని ముఖ్యమైన షాపులలోనూ
లభించును

'గాంధిటెక్స్' చీరెలో సినీనటి భానుప్రియ

H.K. INTERNATIONAL / GS / TL

# అడ్డూ ఆపూ లేని అబద్ధాలు!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

ఒక రాయబారి తన దేశం కోసం విదేశాలలో అబద్ధాలాడితే ఒక ప్రదాన మంత్రి ఏం చేస్తారు? ఆయన తనని తాను కాపాడు కునేటందుకు పార్లమెంటులో అబద్ధాలాడుతారు

రాష్ట్రపతి వృద్ధాప్యంలో ఉన్నారు బహుశా ధూన్ పారశాల బయట ఉన్న ద్వారం దగ్గరికి కూడా ఆయన వెళ్ళి ఉండరు లేకపోతే ప్రధానమంత్రి చేసినటువంటి లేదా చేయకుండా ఉన్నటువంటి దాని గురించి ఆయన అసబ్యమైన పదజాలాన్నే వాడి ఉండేవారు కాని ఆయన ఉత్తరం ద్వారా స్పష్టమయ్యే విషయమేమిటంటే- నిజానికా ఉత్తరాన్ని ప్రధానమంత్రికి కాక పార్లమెంటుకు పంపి ఉండవలసిందనుకోండి- 1984 నవంబర్‌లో కొత్త ప్రభుత్వం పదవిని స్వీకరించినప్పటి నుంచి అంటే గత 900 రోజులుగా దేశాధినేతకు ప్రబుత్వాధినేతకు మధ్య అసలు సంబంధాలే లేవు. ఈ కాలంలో ప్రధాని రాష్ట్రపతిని కేవలం రెండు సార్లు మాత్రం కలుసుకున్నారు రైజినా కొండ మీద జరిగినటు వంటి ఈ రెండు చరిత్రాత్మక సమావేశాలలో ఏమి జరిగిందో మన మీద దయతో వారు మనకు చెప్పలేదు

రాజీవ్ గాంధీ కనుక పార్లమెంటును తప్పుదోవ పట్టించి ఉంటే తగిన చర్య తీసుకునే బాధ్యత పార్లమెంటు సభ్యులది వాటర్‌గేట్ కుంభకోణంలో అబద్ధాలు చెప్పినందుకు నిక్సన్ రాజీనామా చేయవలసి వచ్చింది ఇరాన్ వ్యవహారంలో తన పాత్రకు గాను రీగన్ కూడా నిక్సన్‌ను అనుసరించి శూన్యంలోకి వెళ్ళవలసి ఉందని అనిపిస్తున్నది భారత దేశంలో ప్రధాన మంత్రులు ముఖ్యంగా వాళ్ళు నెహ్రూ వంశంవారయినట్లయితే అంత సులబంగా తమ పదవులను వదిలి పెట్టరు బారత దేశపు ఘనమైన స్థానాన్ని చైనా వాళ్ళు అడుసులోకి లాగుతున్నప్పుడు జవహర్ లాల్ నెహ్రూ దిగి పోవలసింది లేదా ఆయనను తోసి వేయవలసింది కాని ఆయన దిగిపోలేదు జగ్‌మోహన్ లాల్ సిన్హా తీర్పు తర్వాత అస్థానంలో ఉండకూడ నప్పటికీ శ్రీమతి ఇందిరాగాంధీ పదవిలో కొనసాగారు ఆమె తనని తాను రక్షించుకునేందుకు రాజ్యాంగాన్ని మార్చారు అప్రమత్తంగా లేని జాతిమీద అత్యవసర పరిస్థితిని రుద్దారు అంతేగాక, ఆమెను పొగడడానికి తగినంత మంది పార్లమెంటు సభ్యులు కూడా ఉండేవారు సరిగ్గా ఇప్పుడు ప్రదానమంత్రిపై ఈగ వాలకుండా చూసే సభ్యులున్నట్టుగానే

రాజ్యాంగం 78వ అధికరణం ద్వారా ఆదేశించిన బాధ్యతను కూడా ప్రధాన మంత్రి నెరవేర్చలేదని స్పష్టమవుతున్నది పరిపాలనకు సంబంధించి మంత్రివర్గం తీసుకున్న నిర్ణయాలన్నిటినీ రాష్ట్రపతికి తెలియ జేయడం ప్రదానమంత్రి బాధ్యత అని ఈ అధికరణం తెలుపుతున్నది రాజీవ్ గాంధీ ఆ పని చేయలేదు లేదా కనీసం రాష్ట్రపతి అలా అనుకుంటున్నారు ఎంత సంకేత బాష వాడినప్పటికీ రెండేళ్ళకు మించిన కాలంలోని మంత్రివర్గ నిర్ణయాలన్నిటినీ కేవలం రెండు సమావేశాలలో తెలియజేయజాలరు ప్రధాన మంత్రి తమ బాధ్యతలను నెరవేర్చనప్పుడు రాష్ట్ర పతిగానీ మరెవరయినా గాని ఏం చేయవలసి ఉంటుందో రాజ్యాంగం చెప్పలేదు గనుక ఇప్పుడు రాష్ట్రపతి ఏమి చేయాలో స్పష్టం కావడం లేదు మనం ఇప్పుడు ఎదుర్కొంటున్నది రాజ్యాంగ ప్రతిష్టంబనను మించినది ఇది రాజ్యాంగ విచ్ఛిత్తి ఒక రాజకీయ పరిష్కారం ద్వారా తప్ప మరొక రకంగా దీన్ని అదిగమించ గలమని నేను అనుకోవడం లేదు

ఏది ఏమయినప్పటికీ ఇవన్నీ రాజ్యాంగ నిపుణులయినటు వంటి న్యాయవాదులు నిర్ణయించ వలసిన విషయాలు రాజీవ్ గాంధీ ఆయన అనుచర బృందం తమ బృందానికి చెందని ఏ ఒక్కరి తోనూ రాజకీయాధి కారాన్ని పంచుకోవడానికి సిద్ధంగా లేక పోవడం లేదా అశక్తులుగా ఉండడం నుంచి ప్రత్యక్ష ఫలితంగానే ఈ గందరగోళం వచ్చిందనేది వాస్తవం ఇది నెహ్రూ కాలం నుంచి ఇటువంటి పద్ధతిలోనే ఉంటూ వస్తున్నది ఆయన అధికారాన్ని రాష్ట్రపతి బాబూ రాజేంద్ర ప్రసాద్‌ను అలా ఉంచి సర్దార్ పటేల్‌తో పంచుకోవడానికి కూడా ఇష్టపడలేదు సర్దార్ పటేల్‌ను జాతీయ చరిత్ర నుంచి కాకపోతే కనీసం ప్రజల జ్ఞాపకాలలో నుంచి తుడిచి వేయడానికి శత్రుత్వం వల్ల గానీ అసూయ వల్ల గానీ నెహ్రూ ఏ స్థాయికి దిగజారి ప్రయత్నించారో ఎస్ కె పాటిల్ రాసిన దాన్ని బట్టి మనకు స్పష్టమైంది ఆయనకు డాక్టర్ రాజేంద్రప్రసాద్‌తో ఉన్న ఘర్షణలు కూడా అటువంటి మనస్తత్వం నుంచే తలెత్తాయి నెహ్రూ ఎప్పుడూ గొప్ప అభివృద్ధి కాముకుడిగా భ్రమింప జేసే వారు తనకది మేలు చేస్తుందనిపిస్తే అవతలి వాళ్ళను మతోన్మాదులుగా చిత్రించేవారు కాని ఇవన్నీ జిత్తులు మాత్రమే 'అభివృద్ధి నిరోధకుడు' దేహాతీ' అయిన రాజేంద్ర ప్రసాద్ వంటి వ్యక్తితో అధికారాన్ని పంచుకోవడానికి ఆయన ఇష్టపడలేదు రాజేంద్రప్రసాద్ హారోలోనో, కేంబ్రిడ్జిలోనో చదవలేదు అక్కడి చి -చి యాస ఆయనకు వచ్చేదికాదు హారో అని ఉన్న చోట డూన్ స్కూల్ అని చేర్చండి నలభై సంవత్సరాల తర్వాత, ఎప్పటి లాగనే చరిత్ర పునరావృత మవుతున్నదని అర్ధమవుతుంది భారతదేశంలో తమ వర్గం గురించి ఎప్పుడూ స్పృహలో ఉంటూ ఉండేటటువంటి నెహ్రూ కుటుంబం వంటి కుటుంబాలు కొన్నే ఉన్నాయి దానికి బదులుగానే






వాళ్ళు సామ్యవాదం గురించి అంతూ పొంతూ లేకుండా మాట్లాడుతూ ఉంటారు నెహ్రూ అవనే చేశారు. ఆయన కుమార్తె అదే పని చేసింది ఇప్పుడు జీన్సు, మొకాసిన్‌లు వేసుకునే మనవడు కూడా అదే పని చేస్తున్నాడు

తన పూర్వీకుల కంటే రాజీవ్ గాంధీకి పదవీ కాంక్ష ఎక్కువేమోనని నాకు ఎప్పుడూ అనిపిస్తూ ఉంటుంది దీనికి అతి సాదా కారణమేమంటే ఆయనకు పదవి అప్పనంగా, వడ్డించిన విస్తరిలా వచ్చింది ఏవో అస్పష్ట రాజ్యాంగ కారణాల వల్ల దాన్ని పోగొట్టుకోవడం అంత మంచి పనేమీ కాదు ఆయన రాజ్యాంగాన్ని అసలు చదివారా అని కూడా నాకు అనుమానం నాస్తికుడికి బైబిల్ ఎలాంటిదో రాజ్యాంగం అటువంటిది అధికారంలో ఉన్న కొన్ని సంవత్సరాలలో కూడా కాదు కొద్ది నెలల్లోనే రాజీవ్ గాంధీ తన స్వంత స్నేహితులతో నే, విశ్వనాథ్ ప్రతాప్ సింగ్‌ను వదిలేయండి, అరుణ్ నెహ్రూ అరుణ్‌సింగ్ వంటి మనుషులతో కూడా అధికారాన్ని పంచుకో జాలడని తేలిపోయింది వాళ్ళు ఏదో తప్పు చేసి నందువల్ల కాదు నిజానికి తప్పులు చేసే వాళ్ళే నెహ్రూల ఆస్థానంలో సరిగ్గా సరిపోతారు కైరాన్, అబ్దుల్ రహమాన్ అంతులే జానకి వల్లభ్ పట్నాయక్ వంటి వాళ్ళు స్వభావ రీత్యానే ఇటు వంటి లంచగొండి మనుషులందరూ అప్పటికే పరిమితి దాటి పోయారు నెహ్రూల వర్గానికి చెందిన వాళ్ళు కాలేరు నిజాయితీ గల మనుషులే



అనుమానాస్పదులు అంతిమంగా ఏం జరుగు తుందంటే మీ చుట్టూ తిరిగే చెదారం మనుషులు చేరుతారు శ్రీమతి ఇందిరాగాంధీ వినాశకర రాజకీయ జీవితంలోని రెండో భాగంలో ఆమె చుట్టూ చేరినటువంటి వాళ్ళు ఇప్పుడు ఆమె కుమారుడి చుట్టూ చేరుతున్నటువంటి వాళ్ళు వాళ్ళే టిలివిజన్ నుంచి తమను వేరు చేసుకోజాలనటు వంటి పెద్ద గొంతుల ప్రచారవేత్తలు నిన్నటిదాకా సబ్బులు, పౌడర్లు అమ్ముకుని ఇప్పుడు రాజకీయ శిశువులను అమ్ముతున్న వ్యాపార ప్రకటనల అధికారులు, తమకో, తమ రాజకీయ గురువులకో క్షేమకరం కానటువంటి మొత్తంలో డబ్బులు పోగేసుకున్న వెండి తెర దేవతలు ఇటువంటి వాళ్ళే

ఏది ఏమయినా, ప్రధానమంత్రి పార్లమెంటును పక్కదారి పట్టించడం ఇదే మొదటిసారి కాదు ఆయన ఆ పని చాలాసార్లు చేసారు, లేదా ఆయన ప్రభుత్వం ఎప్పుడూ ఆ పని చేస్తూనే ఉంది రాజీవ్‌గాంధీ ఇదివరలో ఒకసారి అస్సేలియన్నతో పంజాబ్ సమస్య సమసిపోయిందని, టెర్రరిస్టులు పారిపోతున్నారని చెప్పారు ఇది అబద్ధం కానట్లయితే, మరి అబద్ధమంటే ఏమిటో నాకు తెలియదు, ఆ ప్రకటన తర్వాత టెర్రరిస్టులు వెయ్యికి పైగా అమాయకులైనటువంటి స్త్రీ పురుషులను పిల్లలను చంపివేశారు ఇంకా ఆర్థిక వ్యవస్థ అత్యద్భుతంగా ఉన్నదని రాజీవ్‌గాంధీ అంటారు, అది ఎట్లా ఉన్నదో మనకు తెలుసు గత రెండు సంవత్సరాలలో మన రూపాయి విలువ ఘోరంగా పడిపోయిందని పాకిస్తానీ రూపాయి కన్నా, శ్రీలంక కరెన్సీకన్న పడిపోయిందని ఇప్పుడు నిర్ధారణ అయింది ఈ స్థితిలో కాంగ్రెస్ అధ్యక్షుడు వెళ్ళి కేరళీయులతో తాను స్వచ్ఛమైన ప్రభుత్వాన్ని అందిస్తానని వాగ్దానం చేస్తారు వాళ్ళకు ఆ పరిశుద్ధమైన ప్రభుత్వాన్ని ఇచ్చేది ఎవరు? ఇంకెవరు మన పాత మిత్రుడు కరుణాకరనే! □

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు : (1938-1972)

17-23 ఏప్రిల్ '87

శ్రీ ప్రభవ నామ సం చైత్ర బ చవితి

**సంపుటము 79 : సంచిక 33**

ముఖ్య సంపాదకుడు :

**శివలెంక రాధాకృష్ణ**

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు

**మతుకుమల్లి మాధవరావు**

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు | 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు | 161 20 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

నటి విజయశాంతి

(ఫోటో ఎస్ జి కె మూర్తి)

### కథలు ·



### సీరియల్ నవలలు



### వ్యాసాలు, శీర్షికలు .





# ఉత్తరాలు

## సీరియల్స్

మాధవి ముఖచిత్రం చాల బాగుంది కొత్త సీరియల్ రాగలత మమ్ములను మొదట్నేనే ఆకట్టుకుంది రచయిత ఘండికోట బ్రహ్మాజీరావు గార్కి మా ధన్యవాదాలు యం యస్ ఆర్ చౌదరిగారి ఆశయం సీరియల్ ముగింపు చాల బాగుంది

ఎల్ వి సుబ్బయ్య, గూడూరు

★ ★ ★

కొత్త సీరియల్ రాగలత చాల బాగుంది శ్రీ బ్రహ్మాజీరావుగారు ఆంధ్ర సాహిత్య చరిత్రలో కృషి చేసిన వారిలో పొగడదగ్గ మహామనిషి నిరాడంబర వ్యక్తి చాలాకాలానికి ఆయన సీరియల్ చదివే ఆనందం కలిగింది

రాళ్ళపల్లి భాస్కరరావు, విశాఖపట్నం

★ ★ ★

కొత్త సీరియల్ రాగలత మొదటిలో మమ్ములను ఎంతగానో ఆకట్టుకుంది రచయిత ఘండికోట బ్రహ్మాజీరావుగారికి హృదయ పూర్వక వందనలు

నాగండ్ల వెంకటేశ్వర్రావు రమేష్, అమ్మాపాలెం డోర్నకల్

★ ★ ★

'ఆరోహణ సీరియల్ మాకెంతో బాగా నచ్చింది రచయితగారు సినిమా రంగాన్ని గురించి చక్కగా రాస్తున్నారు

ఆశయం సీరియల్ ముగింపు మాకు ఎంతో బాగుంది

ఓ అహల్య మైథిలి వెంకటగిరి

★ ★ ★

అన్నపూర్ణగారి ప్రతిస్పందన సీరియల్ చాలా బాగున్నది ఆశయం ముగింపు చాలా బాగున్నది

బి ఏ రమణ ఎ శ్రీనివాస్ రాయగడ

## కథలు

'పుణ్యతిథి' కథ చాల బాగున్నది రచయిత్రి అవధానుల విజయలక్ష్మిగార్కి ధన్యవాదాలు

–ఆర్ లక్ష్మీకమల్ భువనేశ్వర్

★ ★ ★

నటి మాధవి" ముఖ చిత్రంతో వెలువడిన పత్రికలో కోరిక తీరినవేళ కథ చాలా బాగుంది వృద్ధాప్య దశలో తల్లిని కొడుకు ఎలా ఆదుకోవాలో, ఆ కొడుకు బాధ్యత గురించి చక్కగా వివరించినారు రచయిత్రికి నా అభినందనలు

కె ఎన్ వి రవికుమార్, మైలవరం

(73 వ పేజీ చూడండి)

## నిత్య నూతన సీరియల్

### కవిసమ్రాట్

# విశ్వనాథ సత్యనారాయణ

# వేయిపడగలు

### 2వ అధ్యాయము

(గత సంచిక తరువాయి)

ఆ వచ్చుచున్న మహాపురుషుడు దబ్బపండు వంటి దేహచ్ఛాయ వాడు. కోలయు, గుండ్రము కాని ముఖము, అజానుబాహువులు, నల్లనికనులు, విశాలమైన ఫాలభాగము, వయసిరువది యేండ్లుండును. అతని పేరు ధర్మారావు.

ధర్మారావు రామేశ్వరశాస్త్రి కుమారుడు. రామేశ్వరశాస్త్రి నాగేశ్వరశాస్త్రి కైదవతరమువాడు. కృష్ణమనాయడు సుబ్బన్న పేట జమిందారయిన కాలములో రామేశ్వరశాస్త్రి అయనకు దివానుగా నుండెను. కాని రాజు కీర్తికన్న, దివాను కీర్తియే దిశల కెగ్రబాకెను. రామేశ్వరశాస్త్రి శ్రుతిస్మృతులు చక్కగా చదివినవాడు. కొంత కర్మిష్ఠి, యాగాదులు చేయక పోయినను, వైశ్వదేవము చేసి, గృహమున అగ్నిహోత్ర మారనీయని గేస్తు అయన యొక విచిత్ర పురుషుడు. అయన నాలుగు వర్ణముల నుండి బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్ర కన్యలను వివాహమాడి, నలుగురి యందును సంతానము బడసెను. ఇదియు గాక రత్నగిరి యను ఒక భోగాంగన నుంచుకొనెను. ఆమె యందును సంతానము కలిగెను.

లోకదృష్టిలో ఈ వివాహములు, ఈయన కాముకతయు ప్రవాదహేతువులైనను రామేశ్వర శాస్త్రి గారి యౌదార్యగుణ సముద్రములో అవి మునిగిపోయెను. అయన నిరతాన్న దాత. శిబి, దధీచి, కర్ణుడు, రాయని బాచడు, రామేశ్వరశాస్త్రి - ఇది మహాదాతల సంప్రదాయము. ఆ పరగణాలలో రామేశ్వరశాస్త్రి నెఱుగని వారు లేరు. అయన యౌదార్యము రుచి చూడనివారు లేరు. అయన యశస్సు గానము చేయని వారు లేరు.

అయన నాగేశ్వరస్వామి యాలయ ధ్వజ స్తంభమునకు ప్రాత యిత్తడి తొడుగు చెడిపోగా అది తీయించి బంగారపు తొడుగు వేయించెను. వేణుగోపాల స్వామికి బంగారపు మైమఱపు చేయించెను. సత్యభామాదేవికి వేయి రూపాయల వెలగల మాణిక్యము పొదిగిన యడ్డబాస చెక్కించెను. నాగేశ్వరస్వామి యాలయములో వీరభద్రునకు బంగారు మీసములు, కనులు, మధ్య మాణిక్యము పొదిగిన గంధపు గిరవంటి తిలకమును చేయించెను. వేణుగోపాల స్వామి వారి గుడిలో శమీవృక్షము వద్ద శిలావితర్దిక పఱపించెను.

అలయ సదస్సునకు క్రొత్త చలువరాతి మెట్లు కట్టించెను. రెండాలయములలో అయన చేయించిన మరమ్మత్తులకే అయనకున్న సగమాస్తి వ్యయమయ్యెను.

పేదవారల పాలికి రామేశ్వరశాస్త్రి భగవంతుడే. వెనుక ద్వాదశ వర్ష క్షామము వచ్చినపుడు జనులు తిన తిండిలేక మల మల మాడిపోయిరి, జమిందారు గారి ధాన్య మారు వందల పుట్లు రెండు పెద్ద పాతరలు వేసిరి. వానికి కాపలా యెవరుందురు? గూడెములు గుంపులు గుంపులుగా పోయి దోచుకొని పోవుచుండిరి. రామేశ్వరశాస్త్రిగారిని పాతరలకు కాపలి ఉంచిరి. అయన పెద్ద విలుకాడు. విల్లునంబులు దగ్గర పెట్టుకొని అయన ధాన్యము కావలి కాయుచుండెను. చుట్టున నున్న యైదారు గూడెముల వారు గుంపులుగా వచ్చిరి. దూరమున



నిలబడిరి. దగ్గరకు రా గుండెలాన లేదు. ఏమి చేయుటకు తోచినది కాదు. అడుగు వేసిరా అంబు పడినదే. చివరకు వారిలో పదిమంది పెద్దవాండ్రు శాస్త్రిగారి వద్దకు వచ్చి, "అయ్యా! యీ నాడు మా ప్రాణములు మీ చేతిలో ఉన్నవి. అన్నము లేక

చచ్చిననేమి? మీ అంబుల దెబ్బలు తిని చచ్చిననేమి? మా కెటులును భగవంతుడు చావే వ్రాసెను. మాతో బాటు మా యిండ్ల దగ్గర పిల్లలు భార్యలు కూడ చత్తురు. మీకు దయ కలిగినచో

బ్రతికెదము లేకపోయినచో చత్తుము" అని దీనాలాపములు చేసిరి. శాస్త్రిగారి గుండె కరగిపోయెను. తాను కదలి ఒక పాతర చూరయిచ్చెను జనము యథేచ్ఛముగా నొక్కొక్కడు పది పదునొకండు దినముల గ్రాసము నెత్తుకొని పోయిరి. కాని యీ సొమ్ము తనదా? తరువాత జమీందారుగారు శాస్త్రిగారి నడిగిరి "ఇంచుమించుగా వేయి మంది జనము వచ్చిరి అడిగిరి నేను పాతర వదలకపోయినచో వారిలో ఎంత మంది చత్తురో! ఆ పాతక మంతయు నాదా, మీదా? అయ్యా! తమ కంతగా కోపము వచ్చినచో, ఆ ధాన్యముల వెల నేనిచ్చెదను లెండు!" అని శాస్త్రిగారు సమాధానము చెప్పిరి రాజుగారును మరి మాటాడ లేదు

శాస్త్రిగారిని గురించి యిట్టి కథ లెన్ని యేనియు గలవు అందుచేత ఆ చుట్టుపట్ల రామేశ్వరశాస్త్రి గారి పలుకుబడికి మితి లేదు అయన దొక మహాజాతకము అయన బ్రతికి నన్నాళ్ళు కృష్ణమనాయడు జమీందారా? రామేశ్వర శాస్త్రి జమీందారా? అన్నట్లుండెను

ఒకసారి జమీందారునకును, రామేశ్వరశాస్త్రికిని మాట మాట పట్టింపు వచ్చెను అంతే!ఆరేండ్లు వారిద్దరు ఒకరితో నొకరు మాటాడలేదు. శాస్త్రిగారు కోట గడప త్రొక్కలేదు. ఆరేండ్లయిన తరువాత జమీందారు గారు వేణుగోపాలస్వామికి మరల సంప్రోక్షణ చేయించవలసి వచ్చెను ఆలయ మంతయు మరమ్మతు చేయించి మరల క్రొత్త యాలయము కట్టించినట్లే జమీందారు పెద్ద ప్రయత్నము చేసెను సంప్రోక్షణ చేయవలసిన దినము వచ్చినది నానాజనులు కూడి యుండిరి. సాంగాధ్యయన పరులు, శాస్త్రవేత్తలు, గాయకులు, కవులు, వాద్యగాండ్రు, వారాంగనలు, చూడవచ్చిన జనము, సర్వజనులు క్రిక్కిరిసిపోవు చుండిరి. ముహూర్తము సమీపించినది. జమీందారు గారి అనుమతి కోసము సంకల్పము చేయుటకు పురోహితు డెదురు చూచుచుండెను జమీందారుగారి అనుమతి యేమో రాలేదు. వేళ అతిక్రమించు చున్నది పురోహితుడు వేగిరపడు చున్నాడు. కృష్ణమనాయడు తల యెత్తడు ఎవరికి నేమియు తోచినది కాదు. చివరకు అర్చకుడు సాహసించి "అయ్యా! వేళ యగుచున్నది ప్రారంభించు మందురా?" అని అడిగెను. కృష్ణమనాయడు తలయెత్తకయే, "ఇక్కడ ఎవరి నడిగెదవు? అనుమతి యీయదగిన రామేశ్వరశాస్త్రి గారు రాక యింటి వద్ద బిగించుకొని కూర్చుండెనాయెను. పోయి ఆయనను పిలుచుకొని రం"డనెను. అప్పుడందరకు నాశ్చర్యమై పోయెను ఆరేండ్ల నుండి వారికి వీరికి మాటలు లేవని అందరకు తెలియును. జనము పోయి రామేశ్వర శాస్త్రి గారిని రమ్మని పిలిచిరి. శాస్త్రిగారు రాలేదు. "పిలుచుటకు మీరెవరు? పిలువదగిన వారు పిలిచినచో వత్తుములే!" అని ఆయన చెప్పెను. రాజుగారి కీవార్త తెలిసిన వెంటనే వారే పోయి పిలిచిరి వారి ప్రేమ మార్గములే వేరు – నాయడు పోయి "ఏమయ్యా! బిర్ర బిగిసి కూర్చున్నావు? ఆరేండ్లు బిర్ర బిగిసినావు ఇంక నెన్నాళ్ళు బిగిసెదవు? లేచిరా! ఇంక ముహూర్తము దాటిపోవు"ననెను శాస్త్రి ముసిముసి నగవులు నవ్వుచు లేచి వచ్చెను

వారి యిద్దరి చెలిమి యట్టిది. రాజంత యుదారుడు శాస్త్రి యంత గౌరవము కలవాడు ఒక్కొక్కప్పుడు వారిద్దరికి శరీరములే రెండా యన్నట్లు నటించెడివారు

ఆపదలు హరిశ్చంద్రాదులకు తప్పలేదట! అంత రామేశ్వరశాస్త్రి గారికిని చివరి దినములు సరిగా గడవలేదు. సామాన్యముగా జీవితము మొదలి దినములలో కష్టపడినను చివరినాళ్ళలో భాగ్యమనుభవించిన వారిదే మంచి జాతకము మొదట ఎంతటి శ్రీ అనుభవించినను, చివరి రోజులలో లొగుసాను పడినవారిది దురదృష్ట జాతక మనియే చెప్పవచ్చును శాస్త్రిగారి నిరంతర వితరణ గుణముచే ఆయనకు గల ఆస్తి మండు వేసంగినాటి చెరువు నీరు వలె క్రమక్రమముగా శుష్కించిపోయెను

శాస్త్రిగారి యింట ఎంతమంది భోజనము చేయుచుండెడివారో యెవరికిని తెలియదు. ఎవరెందుకు వచ్చిరో తెలియదు ఎవరును నడుగరాదు. ఎవరికి కావలసిన వీళ్ళు వారికి జరుగుచుండెను భోజనమే కాక యంగడికి పోయి జనము యథేచ్ఛముగా శాస్త్రిగారి పేర ఎవరికి కావలసినవి వారు తీసికొనుచుండిరి ఈ జాబితాలు చివరకు వేల క్రిందికి దిగెను. ఆదాయము చాలక శాస్త్రిగారు ఋణములు చేసిరి మరి కొన్నాళ్ళకు కొన్ని భూము లమ్మిరి చివరకు మిగిలిన యాస్తికన్న ఋణమే యెక్కువైనది. అమ్మ జూపినను భూము లెవరును గొనరాలేదు, కాని శాస్త్రి గారింట నన్న సత్రము మాత్ర మవ్యవహితముగా సాగుచుండెను మరికొన్నాళ్ళకు అది సాగుటయు దుర్ఘటమై పోయెను నెమ్మదిగ జన మెవరి దారిని వారు సర్దుకొనిరి. శాస్త్రిగారికి చేతిలో చిల్లిగవ్వ ఆడని దినములు వచ్చెను. బాకీదారుల యొత్తిడి యెక్కువయ్యెను.

జమీందారుగా రొకటి రెండుసారులు సాహాయ్యము చేసిరి కృష్ణమనాయడు వృద్ధుడయ్యెను ఆయన కుమారుడు రంగారావు వ్యవహారము లన్నియు చూచుట మొదలు పెట్టెను రంగారావు తండ్రి వలె గాక కొంచెము బిగువు కలవాడు ప్రతిదానికి జమాఖర్చు చూచెడివాడు వ్యవహారము చూచుకొను భారమంతయు వృద్ధుడైన కృష్ణమనాయడు కుమారుని మీదనే వదలిపెట్టెను రంగారావునకు రామేశ్వరశాస్త్రి మీద అంత అభిమానము లేదు అందువలన శాస్త్రి గారికి గోటలో నుండి సాహాయ్యము వచ్చు మార్గము లేకపోయెను

శాస్త్రిగారి మీద వారంట్లు పుట్టెను. పాపమాయన తల దాచుకొనుటకు వలులేక పోయెను

సరియైన ధరలు కట్టినచో మిగిలిన యాస్తికిని, ఉన్న అప్పునకును సరిపోవును. కాని కొనబోయిన కొరవి, అమ్మబోయిన అడవిగా నున్నది. తెలివి యనిన, ఋణదాతలదే తెలివి మొదట అప్పిచ్చినది ఆస్తిని జూచి చివర కాస్తిని వదిలి మనిసి మీద బడెదరు. మనిసి యొడలిలోని బొమికలు రత్నములా? అతని నెత్తురు కరగించిన బంగారమా? ధన మతని నుండి యెట్లు వచ్చును? అతని వ్యక్తిని పీకికొని తినుట యెందుకో?

రామేశ్వరశాస్త్రి యెవరిని అన్యాయము చేయలేదు. ఆస్తి నపహరించను లేదు. అతని బందుగులు చాలమంది కొంత ఆస్తి భార్య పేర వ్రాయమని చెప్పిరి ఆయన నాలుక కోసినను నట్లు చేయననెను.

ఋణదాతలలో ఒక్కరును శాస్త్రిగారి వలన నుపకారము పొందని వారు లేరు. అందరి కన్న బిడ్డ ఋణదాత నాగన్న సెట్టి. వెనుక నొకసారి జమీందారుగారిని గురించి నాగన్న సెట్టి తూలనాడెను కృష్ణమనాయడు సెట్టిని ఏదో పనియున్నట్లు కోటలోనికి పిలిచి కొరడాలతో కొట్టించుటకు తయారు చేసెను. సెట్టి అదృష్టము కొలది ఆ వేళకు రామేశ్వరశాస్త్రిగారచటికి వెళ్ళిరి. అది చూచి, సెట్టిని వదలించి పంపించి "రాజు లిట్టి పనులు చేసినచో మర్యాద పోదా?" అని జమీందారును మందలించిరి. ఈ నాగన్న సెట్టి తండ్రి ఉత్తరాది వాడు. అతనికి స్వదేశమున గ్రాసము గడువక సుబ్బన్నపేట వచ్చెను. రామేశ్వరశాస్త్రి గారి తండ్రిగారతనిని సమాదరించి

**జరిగిన కథ –1** : సుబ్బన్నపేటలో ఒక యువతి "వేయిపడగల పాము విప్పారుకొని వచ్చి కాటందు కున్నది కలలోన రాజును" అని పాడుకుంటూ వీధిలో తిరుగుతూ ఉంటుంది. ఆమెను గురించి నలుగురూ నాలుగు విధాలుగా అనుకుంటారు. ఆమె గణాచారి. సుమారు మూడు వందల ఏళ్ళ కిందట ఒక కాపు యొక్క ఆవు ప్రతిరోజు అడవిలో ఒక పెద్ద పాముకు పాలు ఇస్తూ ఉండేదిట. ఒకనాడు ఆ దృశ్యాన్ని కాపు చూస్తాడు. ఆ రాత్రి అతనికి సుబ్రహ్మణ్యస్వామి కలలో కనపడి తనకు ఆవు పాలు ఇచ్చిన చోట గుడి కట్టించమని చెబుతాడు. ఆ విధంగా అక్కడ ఒక గుడి, ఒక కోట నిర్మాణం అవుతాయి. కాపు కూతురు గణాచారి అవుతుంది. ఆ వూరికి సుబ్బన్నపేట అని పేరు వస్తుంది. బ్రాహ్మణుడు, వీరన్న ఊరిని నిర్మిస్తారు ఆ విధంగా చాలా తరాలు గడిచి పోయాయి. తరాలు మారినా ఆచారం మారలేదు. ఇప్పటి గణాచారి ఎండ వేడిమికి తాళలేక ఒక చెట్టు నీడన నుంచుంటుంది – అప్పుడే ఒక యువకుడు అక్కడికి వస్తూ ఉంటాడు. అతన్ని చూచి గణాచారి వికృతంగా నవ్వుతూ పాట పాడుతూ ఎదురుగా పరిగెత్తుంది. ఆ పాట పాము బుసకొట్టినట్టుగా ఉంది.

# విజయ్ మిక్సీ

**55** నిమిషాలు నిర్విరామంగా
పనిచేయగలదు.

## ఉచితం!

"ప్రతీ విజయ్
మిక్సీతో ఒక
విజయ్
స్విచ్ ఐరన్
ఉచితం."






ఈ అవకాశం
కొద్ది రోజులు మాత్రమే

**Vijay**® - a friend of your family

JAISONS AMA 687






## రాగలత

మనిషిని అడిగాను

ఆ పెద్దమనిషి నేను వచ్చి నిలబడ్డానని వయసులో నున్న ఆడపిల్లను అవిధంగా నిలబెట్టకూడదని భావించినట్లు లేదు అతని ధోరణి అతనిది నేను వచ్చినట్లు అతను గమనిస్తే తప్పకుండా తానే ముందు పలకరించేవాడు

అతను ఇరవై రెండు ఇరవై మూడేళ్ల వయసులో ఉన్నాడు పంచ కట్టుకున్నాడు పొడుగు చేతుల చొక్కా తొడుక్కున్నాడు పక్క పాపిడి విశాలమైన నుదురు ఆ నుదుటి మీద అతని ముంగురులు అతను చదివే పద్యాలకు అనుగుణంగా నాట్యమాడుతున్నాయి

నేను అరగంట సేపయి లోనికి వచ్చి ఆ పద్యాలు వింటూ అలా నిశ్చేష్టురాలయి ఉండి పోయాను ఆయనకు చాల బిరుదులున్నాయి ఆయన నాటకాలంటే ప్రజలు వెర్రెత్తి పోతారు

గత నెల రోజుల నుండి ఆంధ్ర నాటక కళామండలి వారు రాజమహేంద్ర వరంలో నాటకాలాడు తున్నారు పది నాటకాలలోను అప్పుడే ఎనిమిది నాటకాలయి పోయాయి మరి రెండే ఉన్నాయి విప్ర నారాయణ హరిశ్చంద్ర

ఒక నాటకమూ చూసే అవకాశం నాకు చిక్కలేదు పరీక్షలు అవుతున్నాయి– ఇవాళతో ఆఖరి పరీక్ష అయిపోయింది మధ్యాహ్నం ఒంటిగంటకు పుస్తకాలు మూలకు పడేసి హాయిగా నిద్ర పోదామనుకున్నాను కాలేజి అనివర్సరీ ఇంకా పది రోజులే ఉంది ఆ నాడు మా లేడీ స్టూడెంట్సు ఒక నాటకం వేయాలని ప్రిన్సిపాలుగారు ప్రత్యేకంగా కబురు పంపించి చెప్పారు విద్యార్థినుల కల్చరల్ అసోసియేషనుకు సెక్రెటరీగా నున్న నా తలపై ఆ భారం పడింది అభిజ్ఞాన శాకుంతలం ఆడాలని చాల కాలమయి మేము అనుకుంటున్నాము కొన్ని పాత్రలకు తగిన అమ్మాయిలున్నారు కాని దుష్యంతుడి పాత్రకు తగిన మనిషి మా లేడీ స్టూడెంట్సులో ఎవరూ కనిపించలేదు మందాకిని ఉంది ఎత్తు, ఒళ్ళు అన్నీ బాగానే ఉన్నాయి కాని ఆమె గొంతుక కీచుగా ఉంటుంది ఎంత జాగ్రత్తగా మేకప్ చేసినా దుష్యంతుడు వేషం ఆడపిల్ల వేసినదని తెలుస్తుంది అప్పుడు నాకో చిన్న ఆలోచన తట్టింది సమర్థులైన మగనటులు దొరికితే వారిని పిలిపించడానికి ఏవైనా అభ్యంతరాలున్నాయా? ముఖ్యంగా హీరో పాత్ర బాగుండక పోతే నాటకం రక్తి కట్టదు నేను శకుంతలగా నటించాలి కాబట్టి, నాకు అంగీకారమైతే ప్రిన్సిపాలు గారు ఒప్పుకుంటానన్నారు ఇరవయ్యో శతాబ్దం అయి పోవస్తున్నది, ఆంధ్రులం అన్ని విధాల ముందంజ వేస్తున్నాము ఇటువంటి చిన్న మార్పుకి మరేం తప్పు లేదని అందరి చేత ముందే ఒప్పించాను

అప్పుడే నాకీ ఆలోచన తట్టింది

నటరత్న నాగభూషణం గారి నాటకాలు నెల్లాళ్లయి ఆడుతున్నారు మా వార్షికోత్సవం వేళకి అన్ని నాటకాలు అయిపోయి అతను ఖాళీగా ఉంటారు అతని గురించి ప్రజలలో చాల మంచి అభిప్రాయముంది ఆయనను రంగస్థలం మీద చూసిన వారు అతడు నటుడిగా పుట్టాడని అంటున్నారు అతనిని ఇంటర్వ్యూ చేసిన పత్రికా విలేఖరులు అతనికి కల అపారమైన నాట్య శాస్త్ర జ్ఞానం గురించి వ్రాస్తున్నారు మంచి అనుభవం కల మనిషి అతడిని దుష్యంతుడిగా మా నాటకంలో వేయమని అడగాలని వచ్చాను– అతని రేటు చాల హెచ్చు అయినా విద్యార్థినులతో కలిసి వేసే నాటకానికి ఆయన కన్సెషన్ ఇవ్వవచ్చు ఇన్ని ఆలోచనలు పెట్టుకొని నాటక మండలి వారికి బస యిచ్చిన సెకెండరీ స్కూలుకి పని కట్టుకొని ఆ సాయంకాలం వెళ్లాను

నేను వెళ్లేసరికి ఆ పెద్ద గదిలో ముగ్గురే ఉన్నారు ఒకాయన కిటికీ దగ్గిర రెండు బెంచీలు జోడించుకొని రంగురంగుల ముఖమల్ దిండు మీద తలపెట్టుకుని పలుచని శాలువ కప్పుకొని పడుకున్నాడు మరో యిద్దరు అతనికి కొద్ది దూరంలో బెంచీల మీద ఎదురెదురుగా కూర్చున్నారు

పద్యాలు చదివేఆయన చాల చక్కగా ఉన్నాడు మనిషి కూడా ఒడ్డూ పొడుగూ అన్ని విధాల బాగున్నాడు ఇక అతని పద్యాలు వింటుంటే నేను చేష్టలు దక్కి నిలబడిపోయాను అరగంట వరకు నిలబడే ఉన్నా నాకేమి శ్రమ

# ధర్మపథం




## పితృదేవతాతృప్తి

భౌతిక శరీరాన్ని విడిచిన తాత, తండ్రి మున్నగువారు పరలోకంలో నివసిస్తూ వుండుటవల్ల వారికి తృప్తి కలిగించుటకై శ్రాద్ధకర్మలు చెయ్యడం హైందవ సంప్రదాయం మృతుల యెడలగల భక్తి కారణంగా వానిని శ్రద్ధతో చేయుట వల్లనే ఆకర్మకు శ్రాద్ధకర్మ అనే పేరు వచ్చినది అన్ని జాతులవారూ ఈ కర్మను తమతమ సంప్రదాయాల ననుసరించి సంవత్సరానికి ఒకసారి అయినా ఆచరిస్తారు అబ్దమునకు అంటే సంవత్సరానికి ఒకసారి చేసే కర్మ కనుక దీనికి ఆబ్దికమనే పేరు వచ్చింది దానిని తద్దినం అని కూడా వ్యవహరిస్తారు తద్దినం అంటే ఆ పెద్దలు మృతి చెందిన దినమన్నమాట ఆ దినం యధావిధిని పితృకార్యం జరిపి ఆప్త బంధువులతో కలిసి భోజనం చెయ్యడమున్నూ ఆచారమే అది దివంగతులకు తృప్తిని కలిగిస్తుందని మనవారి విశ్వాసం శ్రాద్ధ దినమే కాకుండా సంక్రాంతి దినాల్లోనూ, ముఖ్యంగా మకర సంక్రాంతినాడూ పితృ తృప్తి కొరకైనా క్రియలను జరుపుతూ ఉంటారు

ప్రాచీన కాలంలో శైవ, వైష్ణవ మతాలు మాత్రమే బహుళ ప్రచారం పొందినా, హిందూ మతంలో గత శతాబ్ది నుంచీ వేర్వేరు సంప్రదాయాలు ప్రచారంలోకి వచ్చాయి వాటిలో బ్రహ్మ సమాజం, ఆర్య సమాజం, రాధాకృష్ణ సంప్రదాయం, హరనాధప్రభు సంప్రదాయం కొన్ని కొన్ని సౌకర్యాలను కలిగించి ప్రజలను ఆకర్షించసాగినవి వీరిలో కొంతమందికి పితృ కార్యాలతో నిమిత్తం కానరాదు అవి అనవసరమని వారి అభిప్రాయం!

"మానవుడు మరణిస్తే దేహమే నశిస్తుంది ఆత్మకు నాశంలేదు. అది వేరొక దేహంలో ప్రవేశిస్తుంది? అని గదా చెప్తున్నారు! అలాటప్పుడు మరణించిన తాతలు, తండ్రులు మున్నగువారు మరో లోకంలో ఉంటారని ఎలా అనుకోగలం? వారి కోసం కర్మ కలాపాలు చెయ్యడం ఎందుకు?" అని కొందరు అనుకుంటారు.

జన్మాంతర, పరలోకాల ప్రసక్తి లేదు ఏది ఎలా ఉన్నా మన జన్మకు కారణమైన పితృ, పితామహాదులను మనం ఎంత మాత్రం మరచి పోకూడదు వారి యెడల కృతజ్ఞతను, గౌరవాన్ని చూపుటకే ఈ ఆబ్దికాదులు ఏర్పడినవి ఇవే లేక పోయినయెడల వారు సులభంగా మరపులోకి వస్తారు తాము తండ్రులను చూచినా, చూడకపోయినా వారిపేరు జ్ఞప్తిలో ఉండవచ్చు తాతలపేరు, ముత్తాతలపేరు తెలిసినవారు నూటికి ఒకరైనా ఉండుట అరుదు. సంవత్సరానికొకసారి అయినా, వారిని స్మరించుటకీ పితృ కార్యం ఆధారం దీనిని విసుగు లేకుండా శ్రద్ధతో ఆచరించడం కనీస, ధర్మం

—బులుసు వేంకటరమణయ్య

---

అనిపించలేదు అతను నేను కోరిన విదంగా అబిజ్ఞాన శాకుంతలంలో పద్యాలే చదువుతున్నాడు కాళిదాసుడి మూల నాటకం నుండి ముందు శ్లోకం చదువుతున్నాడు తరువాత తెలుగులో కందుకూరి వారి అనువాదం నుండి పద్యాలు చదువుతున్నాడు చాల బాగుంది వెదకబోయిన తీగ కాలికి తగిలింది మేమాడబోయే నాటకం వీరికి పాతదేనన్నమాట తక్కువ వ్యవధిలో రడీమేడ్ మగ నటుడు దొరకడం నా అదృష్టంగా బావించాను

ఆ పద్యాలు అతను అమోఘంగా చదువుతున్నాడు నిండు కుండ-తొలకదు అదే దృష్టితో లోకాన్ని మరచిపోయి అతను చదువుతున్నాడు ఒకటి రెండుసార్లు మధ్యలో ఆగి ఎదుటి మనిషికి ఏవో వివరించాడు అతని కంఠం ఎంత సౌమ్యంగా ఉంది?

శాకుంతలంలోని పద్యాల తరువాత అతను హరిశ్చంద్ర నాటకం నుండి రెండు పద్యాలు చదివాడు

అకటా చేరడు నేల కుందగడె

ఏదో దివ్యమయిన అనుభూతి రంగస్థలంపై అతని పద్యాలు వినే భాగ్యం కలగకపోయినా మరో విధంగా హరిశ్చంద్రలో పద్యాలు వింటున్నందుకు చాల సంతోషించాను నాగభూషణంగారి హరిశ్చంద్ర నాటకమంటే జనం విరగబడిపోతారు అందులో ఈ పద్యానికి ఎంతో ఆదరణ ఉంది ఆ విరుపులు, ఆ సమాసాలు, ఆ నడక . అన్నీ అద్భుతంగా ఉంటాయని, ఎన్నిసార్లు విన్నా తనివితీరదని అంటారు నా ఎదుట మనిషి నేను అదకూతుర్ని దగ్గర్లో నిలుచున్నాననే నా గుర్తుంచుకోకుండా పద్య పఠనంలో నిమగ్నుడయ్యాడంటే ఎంత డెడికేటెడ్ ఆక్టరు? ఆ పద్యంలో రాగం పాలు తక్కువ అతని ముఖంలో తోచిన దైన్యం గొంతు నుండి వెలువడుతున్న పద్యంలోని మాటలతో అన్వయించింది అదే రంగస్థలం మీదనయితే వేలకొలది ప్రేక్షకులు కన్నీళ్ళు కార్చవలసిందే ఇదంతా నాటకమని నమ్మవలసిన నావంటి దానికే ఆ పద్యం వింటుంటే కళ్ళు చెమ్మగిల్లాయి

(ఇంకా ఉంది)




# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

### ప్రసాదరావు, బిలాయి

ప్ర మోషన్ సరిగా అవదు అయితే దుర్వాసన, గేసు

జ బైద్యనాథ్ గైసాంతకబటి టాబిలెట్స్ ప్రతిసారి రెండు చొప్పున రోజు రెండు మూడుసార్లు చప్పరించాలి బైద్యనాథ్ అవిపత్తికర చూర్ణం రాత్రి పడుకోపోయేటప్పుడు 2 చెంచాలు గోరు వెచ్చని నీటితో వాడాలి భోజనం తరువాత బైద్యనాథ్ దశమూలారిష్ట రోజుకు రెండు సార్లు తీసుకోవాలి తేలిక ఆహారము మంచిది

### కె సునంద, ప్రొద్దుటూరు (18 సం లు)

ప్ర ఆకలి అసలు లేదు వాంతి వస్తున్నట్లు ఉంటుంది

జ మలబద్ధకము ఉందా ఉంటే విరేచనమునకు మందు వాడాలి బైద్యనాథ్ లఘుసూతశేఖర రసం రెండు మాత్రలు రోజు రెండు సార్లు భోజనానికి ముందు బైద్యనాథ్ ద్రాక్షారిష్ట భోజనం తరువాత రోజు రెండు సార్లు వాడాలి బైద్యనాథ్ లవణ బాస్కర చూర్ణము రోజు రెండుసార్లు పల్చని మజ్జిగతో వాడండి

### కె సుజన, ప్రొద్దుటూరు

ప్ర కీళ్ళ దగ్గర నొప్పులు

జ ఉదయం సాయంత్రం బైద్యనాథ్ మహాయోగరాజ గుగ్గులు మాత్రలు 1 చొ న బైద్యనాథ్ మహారాస్నాదికాడాతో సేవించండి రాత్రి పడుకోపోవునపుడు బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ పాలతో తీసుకోవలెను

### టి. యస్ ప్రకాశం, విజయవాడ

ప్ర మా కుర్రవానికి జ్ఞాపకశక్తి తక్కువ

జ బైద్యనాథ్ బ్రాహ్మీబటి స్వర్ణయుక్త రెండు రోజులకు ఒక మాత్ర పాలతో మరియు బైద్యనాథ్ బ్రెన్ టాబిలెట్సు 2 చొ రోజు ఉదయం సాయంత్రం బైద్యనాథ్ శంఖపుష్పి సిరప్‌తో వాడించండి

### యస్ హర్‌నాథ్, కోడూరు, సురేష్‌కుమార్, కుమారి పి శైలజ, రామకృష్ణ కళ్యాణిఖని

ప్ర శరీరము లావు పెరుగుటకు శక్తి కావాలి ఆకలి పెరుగుటకు

జ బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషలు ఉదయం సాయంత్రం పాలతో వాడాలి భోజనం తరువాత స్త్రీలయితే బైద్యనాథ్ సుందరీకల్ప పోర్ట్ పురుషులైతే బైద్యనాథ్ ద్రాక్షాసవ స్పెషల్ రోజుకు రెండు సార్లు వాడాలి బలమైన మంచి సాత్వికాహారము తీసుకోవాలి

### పి యస్ రావు, కాకినాడ

ప్ర కడుపులో వాయువు పొత్తికడుపు నొప్పి

జ ప్రతిరోజు రాత్రి బైద్యనాథ్ అవిపత్తికరచూర్ణం రెండు చెంచాలు గోరువెచ్చని నీటితో సేవించండి ఉదయం సాయంత్రం బైద్యనాథ్ లఘుసూతశేఖర రసం మాత్రలు రెండేసి చొప్పున బైద్యనాథ్ శారిబాద్యాసవతో వాడండి కారము పులుపు, ఉప్పు తగ్గించాలి తేలిక ఆహారము మంచిది

### యమ్ శ్రీనివాసరావు, వినుకొండ రోడ్డు, నరసరావుపేట

ప్ర ఊపిరితిత్తుల నిమ్ము

జ బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ ఉదయం సాయంత్రం పాలతో సేవించండి భోజనం తరువాత రోజు రెండుసార్లు బైద్యనాథ్ అర్జునారిష్ట బైద్యనాథ్ దశమూలారిష్ట కలిపి వాడండి

### యన్ రాధాకృష్ణరెడ్డి, వించోలి

ప్ర మూత్ర సంబంధమైన వ్యాధి

జ బైద్యనాథ్, చంద్రప్రభాబటి 1 మాత్ర బైద్యనాథ్ ఎదరీనా 1 మాత్ర బైద్యనాథ్ బలగోక్షుర రస 1 మా చొప్పున రోజుకు రెండుసార్లు, ఉదయం సాయంత్రం బైద్యనాథ్ సురక్తాస్ప్రాంగ్‌తో సేవించండి

### యన్ మేఘశ్యామలరెడ్డి, కుంట్రపాకం

ప్ర ఒక కాలు ఒక చేయి అప్పుడప్పుడు లాగుతూ ఉంటుంది

జ: బైద్యనాథ్ స్వర్ణమకరధ్వజ 1 మాత్ర రోజు కొకసారి బైద్యనాథ్ విటా- ఎక్స్ ఉదయం సాయంత్రం 1 మాత్ర చొప్పున రోజు రెండుసార్లు భోజనం తరువాత బైద్యనాథ్ అశ్వగంధారిష్ట రోజుకు రెండుసార్లు సేవించాలి

### జి రవిశంకర్, తుని

ప్ర పొట్టిగా ఉంటాను ఎదగటానికి మందు

జ బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ ఉదయం సాయంత్రం పాలతో భోజనానికి ముందు మరియు భోజనం తరువాత బైద్యనాథ్ ద్రాక్షారిష్ట రోజుకు రెండుసార్లు సేవించండి వ్యాయామం అవసరం ఎక్కువగా ఆకుకూరలు, తీగకూరలు వాడాలి

### యం యన్ మూర్తి, నరసరావుపేట

ప్ర నంజువ్యాధి బహిష్టు దోషము

జ బైద్యనాథ్ లివరెక్సు బైద్యనాథ్ పునర్నవామండూరము 1 1 మాత్ర చొప్పున బైద్యనాథ్ అశోకారిష్టముతో ఇవ్వండి మంచి ఆయుర్వేద డాక్టరుకు చూపించండి

### ఇ ప్రమీలారాణి, నందలూరు

ప్ర ముఖము నిండా మొటిమలు వెంట్రుకలు రాలిపోవుట

జ బైద్యనాథ్ సురక్తాస్ప్రాంగ్ విడవకుండా ఉదయం సాయంత్రం 2 చెంచాలు మందు 2 చెంచాలు నీరు కలిపి వాడండి తల నూనెగా బైద్యనాథ్ మహాభృంగ రాజతేల్ వాడండి వేడి చేసే వస్తువులు కారము పులుపు ఉప్పు తగ్గించండి

### పి వి సత్యనారాయణ, కాకినాడ; జి పావనకుమార్, తిరుపతి

ప్ర కంటి చూపు సరిగా లేదు

జ బైద్యనాథ్ త్రిఫలామృతము 1 చెంచా ఉదయం ఏమి తినకుండా గోరు వెచ్చని పాలతో సేవించండి అదే మృతము రాత్రి పండుకొనే ముందు కంటి లోపల కలికముగా రాసి తేలికగా పైపైన రాయండి

### బి శ్రీనివాస్, మచిలీపట్నం

ప్ర నత్తి, బలహీనత, భయం, తదితరములు

జ బైద్యనాథ్ బ్రెయిన్ టాబిలెట్ 2, బైద్యనాథ్ విటా ఎక్స్ టాబిలెట్స్ 2 ఉదయం సాయంత్రం పాలతో సేవించండి భోజనం తరువాత బైద్యనాథ్ అశ్వగంధారిష్ట రోజు రెండు సార్లు వాడండి ధైర్యంగా ఉండండి

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

ప్రశ్న

పంపినవారి పేరు

పూర్తి చిరునామా



## వ్యభిచారాన్ని ప్రోత్సహించే పత్రిక!

ఇటలీ దేశానికి చెందిన లుక్కికో అనే వో పత్రిక వ్యభిచారాన్ని ప్రోత్సహిస్తూ, అబినందిస్తూ ఎడిటోరియల్స్ రాస్తోందట భగ్న హృదయులకూ, జీవితంలో సారం పోయిన వారికి ఆ సుఖం దొరకని వారికీ వ్యబిచారులు సుఖం అందించి వారి జీవితాలను రసమయం చేస్తారు ఈ వ్యబిచార మనేది ఒక టానిక్కు లాటిది తాగుడూ జూదాన్ని, గుర్రపు పందాలను మరితర వ్యసనాలనూ కూడా ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ప్రోత్సహిస్తున్న ప్రబుత్వాలు యీ వ్యబిచారాన్ని ఈకళను దీని ఆవశ్యకతనూ ఎందుకు సరిగా అర్థం చేసుకోవో తమ కర్థం కాలేదని యీ పత్రికాధిపతులు తెగ రాసి పారేస్తున్నారట ఇటలీలో వ్యభిచారం నేరం కాకపోయినా దాన్ని పని గట్టుకుని ప్రోత్సహించదు ఈ పత్రిక అపని కూడా ఏల చేయరాదు అని నిగ్గదీస్తోందట

## వాన దేవుడి మెప్పుకై గాడిదల వివాహం!

తమిళనాడుకు చెందిన నామక్కల్ అనే వూరిలో వానలకోసం సశాస్త్రంగా వో రెండు గార్దబాలకు ఆ వూరి పెద్దలు వివాహం జరిపించారట ఇలా రెండు గాడిదలకు పెళ్ళి చేసి, సంపర్కం ఏర్పరిస్తే వరుణుడు ఆనందించి వానను ప్రసాదిస్తాడనే వో ప్రగాడ విశ్వాసమట ఆ వూరి ప్రజలకు -

## ప్రభుత్వ ఆసుపత్రిలో యువతి మృతి!

ఒరిస్సా భువనేశ్వర్ ప్రబుత్వ ఆసుపత్రిలో రత్ అనే ఆయన తన బార్య గాయత్రిని కాన్పు కోసం చేర్పాడట ఆవిడకు నొప్పులు ఆరంబమయి సాదారణమైన స్థితి దాటిపోయేసరికి అక్కడి




సిబ్బంది డాక్టర్ మార్కండేయ అనే డ్యూటీ డాక్టర్ని రమ్మని కోరితే ఆయన వెళ్ళలేదట ఆవిడ మగపిల్ల వానిని కన్నాక రక్తస్రావం ఆగలేదట ఆ విషయం చెప్పినా ఆయన రాలేదట చివరికి మరన్నిసార్లు పిలిస్తే ఆ డాక్టరుగారు ఏవిటంత హడావిడి అంటూ నింపాదిగా వెళ్ళేసరి కామె చనిపోయిందట ఈ విషయాన్ని అమె బర్త రత్ రాష్ట్రపతికి ప్రదానికి ఫిర్యాదు చేసేసరికి ఆ డాక్టర్నీ, వో నర్సును సస్పెండు చేసి ఆ కేసు విచారిస్తున్నారట

## హాలీవుడ్ నటుని అఖండ తెలివి!

హాలీవుడ్ ప్రముఖ నటుడు పాల్ న్యూమన్ ఇటీవల దర్శకుడిగా మారి వో బారీ చిత్రాన్ని నిర్మించ నారంబించాడట ఆ సందర్భంగా సూర్యాస్తమయాన్ని అతి బ్రహ్మాండంగా తీయడానికి అట్లాంటిక్ మహా సముద్రంవద్ద బిచాణా పరుచుకు కూర్చున్నాడట మద్యాహ్నానికే కానీ కాలం గడిచిన కొద్దీ యిటు రావాల్సిన సూర్యుడు అటు కొండల్లోకి దిగిపోతున్నట్టు గమనించి ఆశ్చర్యపోయి అంతలో తన తెలివికి నెత్తీ నోరూ బాదుకున్నాడట అసలు విషయం అట్లాంటిక్ మహా సముద్రం తూర్పు సముద్రంకదా! సూర్యుడు అటు పక్క వుదయిస్తాడు గానీ, అస్తమించడు కదా అనే విషయం ఆయనకు సూర్యాస్తమయానికి తెలిసొచ్చిందట - హేట్సాప్ టు టూ ఇంటిలిజెన్స్

## నర రూప రాక్షసుడు!

తెనాలికి చెందిన శ్రీనివాసరావు అనే అతనికి శలపాడుకు చెందిన వసుందరాదేవి అనే అమ్మాయికీ 1985 లో వివాహం జరిగిందట మిల్లులో వో గుమస్తాగా పనిచేసే శ్రీనివాసరావు తాను వ్యాపారం చేయడానికి మామగారిని వో యాభై వేల రూపాయలు ఈనాంగా అడిగాడట దానికాయన ఏం వ్యాపారం చేస్తావో చెప్పు కొట్టు ఎక్కడ పెడ్తావో చెప్పు అంటూ ప్రశ్నలడిగాడట తత్ఫలితంగా యిహ అతను తన బార్యకు బూలోక నరకం చూపనారంబించాడట ఆ రాక్షసంలో అతను పరిపూర్ణత సంపాదించి వొకనాడు మీ వూరెళ్దాం పద అని ఆమెను టి వి యస్ మోపెడ్మీద ఎక్కించుకుని బయలుదేరి జాగర్లమూడి ప్రాంతంలో బండిని మరో దారి పట్టించి అక్కడో చోట ఆపాడట అతను సిద్ధం చేసిన కిరాయి రౌడీ లో యిద్దరు వికట అట్టహాసం చేస్తూ ఆమెమీదపడి మానబంగం చేస్తూంటే బ్లూ ఫిలిం చూసినంత సంతోషంగా చూశాడట వారిద్దరూ ఆమెను మారిమారి అనుబవించి ఆనక చంపేసి నగలు వొలిచేశాక ముగ్గురూ కలసి ఆమెను [illegible] విసిరేసి చేతులు దులుపుకొన్నారట పోలీసు లాతన్ని అరెస్టు చేసి విచారణ జరుపుతున్నారట

## అనుమానంతో భార్యను హత్య!

శ్రీశైలం డోర్నాలకు చెందిన మర్రిపాలెం అనే వో చిన్న పల్లెలో చిన్న నాగయ్య అనే వొకతను తన బార్య నాగమ్మను రతి[illegible] పోయేవాడట దాంతో అతనికి ఆమె రతి సంతృప్తి కోసం పక్కదారులు వెతుక్కుంటుందేమోననే బయం పుట్టిందట అదే ద్యాసలో వుండడంతో ఆతనికి తన బార్య అదే వూరుకు చెందిన జోళ్ళ నాగన్న అనే అతనితో రతి సుఖం పొందుతున్నట్టు వో కల వచ్చిందట ఆ కలకు అదిరిపోయి ఆమెను ఆరేళ్ళ కొడుకునూ ఆమె పుట్టింటికి తోలేశాడట ఈ విషయం పంచాయితీలో విచారించి కలలను ఆదారం చేసుకుని అనుమానించడం న్యాయం కాదని, అతను తన పెళ్ళాన్ని ఏలుకోవాలని వారు తీర్పిచ్చారట బార్యని తిరిగి తెచ్చుకున్నా అతని కా అనుమానం చావక మృగంగా మారి వోరోజు వంట చేస్తున్న నాగమ్మ కుత్తుకను కత్తితో పరపర కోశాడట అంతేగాక కలలో తన బార్యతో రతి సుఖం పంచుకున్న ఆ జోళ్ళ నాగన్నను బాణం వేసి చంపేసి ఆనక మరో యిద్దర్ని కూడా చంపేశాడట

## పెరుగుతున్న భారత దేశ జనాభా!

బారత దేశంలో కుటుంబ నియంత్రణలూ వగైరాలున్నా జనాబా శక్తివంచన లేకుండా పెరుగుతూనే వుందట ఈ కార్యంలో ఉత్తరప్రదేశ్ది




అగ్రస్థానమట వెయ్యికి 39 మంది ఆ రాష్ట్రంలో అయితే తమిళనాడులో 27 5 అట కేరళ మాత్రం ఎంచక్కా ఆఖరిస్థానంలో వెయ్యికి 26 తో వున్నదట - వ్వేరార్ వుయ్!

# భ్యాతేప్రా – జీవాప్యా!!

## సి.యల్.నరసింహారావు వి.వి.రమణారావు

రాత్రి తొమ్మిదిన్నర!

భోజనానంతరం అరుబైట పచార్లు చేసే అరగంట కార్యక్రమం ముగియటంతో తిన్నగా తన గది వైపు వెళుతున్నాడు రాఘవరావు ఆ సమయంలో రివాజు తప్పి గుమ్మం దగ్గరే మీనాక్షి నిల్చొని వుండటం ఆశ్చర్యం కలిగించింది!

ఏవిటి? అన్నట్టు తలపంకించాడు మౌనంగానే!

భర్త ఆశ్చర్యాన్ని మౌన బాషను అర్థం చేసుకున్న మీనాక్షి వెంటనే మాట్లాడటానికి తటపటాయించింది

భార్య సందిగ్ధ స్థితిని పట్టించుకోకుండా లోపలికి వెళ్ళబోయాడు రాఘవరావు! మీనాక్షికి తెంపు చేయక తప్పింది కాదు!

కొంచెం మీతో మాట్లాడాలండీ అంది చిరునవ్వుతో!

మీనాక్షి మాటల వైఖరి కూడా కొత్తనిపించింది రాఘవరావుకు!

నువ్వడిగిన తీరు నాటకంలో డైలాగులావుంది అన్నాడు నవ్వుతూ!

నాకు తెలిసిన తీరు అదేనండీ మళ్ళీ చిరునవ్వుతో నే అంది

నా పని పూర్తయ్యాక తెల్లవ గ్గూ కూర్చొని మాట్లాడుకుందాం నువ్వు మామూలుగా అక్కడ కూర్చొని ఆ పత్రికల్ని నమిలెయ్ సమాదానంకోసం ఎదురు చూడకుండా గదిలోకి వెళ్ళిపోయాడు రాఘవరావు

మీనాక్షి నిరాశపడ్డది! అయినా మనసు చురుగ్గా ఆలోచించింది తన అభిప్రాయం వెల్లడించటానికి రోజులో ఇంతకన్నా మంచి సమయం దొరకదు రేపైనా ఇదే పరిస్థితి! ఏ పదిన్నరకో నిద్ర కుపక్రమించబోయే ముందు ఆయన మనసు నొప్పించటం బావ్యంగా వుండదు ఈ సమయాన్ని సద్వినియోగం చేసుకోవటమే సముచితం!

మెరుపులా గదిలో ప్రవేశించింది మీనాక్షి! తపో భంగమైన మునిలా తలెత్తి చూసాడు రాఘవరావు

నెమ్మదిగా వెళ్ళి రాఘవరావు కెదురుగా చాపమీద కూర్చుంది మీనాక్షి

రాఘవరావు ముఖం చిన్నబోయింది! మరో మాటలేకుండా వయొలిన్ తీసి కేస్‌లోపెట్టి కేసను యథాస్థానంలో వుంచాడు

మీనాక్షి మనసు విలవిల్లాడింది కాని తప్పని పరిస్థితి కాబట్టి, ఆరోజ ఈ రోజే ఎందుకు కాకూడదని సమాధానా పర్చుకుంది సాహసించ టానికి నిర్ణయించుకుంది

రాఘవరావు లేచి మంచం మీద కూర్చున్నాడు మౌనంగా!

నామీద కోపం వచ్చిందనుకుంటా! అంది మీనాక్షి నంగిగా

చటుక్కున లేచి అద్దం ముందుకు వెళ్ళి నిల్చున్నాడు రాఘవరావు వింతగా చూస్తుండి పోయింది మీనాక్షి

రాఘవరావు తిరిగొచ్చి మంచం మీద కూచుంటూ

నాకు కోపం వచ్చినట్టు మన అద్దం చెప్పలేదే! అన్నాడు గంభీరంగా నవ్వుతూ

ఐతే బతికిపోయాను ఊపిరి పీల్చుకుంది మీనాక్షి

దీమగ్గా ధైర్యం చెప్పాడు రాఘవరావు

మీరు ఈ విషయాన్ని గురించి ఆలోచించటం లేదని అనుకోను కాని నా తాపత్రయం నాది అంది మీనాక్షి దగ్గరికి జరిగి

బార్య కళ్ళల్లోకి నిశితంగా చూసాడు రాఘవరావు

మీరు ఏవీ అనుకోనంటే ఒక ప్రశ్న అడుగుతాను!

ప్రశ్నా!!

అలాంటిదే!

అడిగెయ్

మన పిల్లల బవిష్యత్తు గురించి ఏం ఆలోచించారు?

రాఘవరావు మొహం తెల్లబడిపోయింది

చెప్పండీ మీనాక్షి వూరుకోలేదు

ఏం చెప్పను? అన్నాడు రాఘవరావు విషయం స్ఫురించక

అప్పుడే మన అర్చనకు పన్నెండేళ్ళు నిండాయి! వందన పదో ఏడులో ప్రవేశించింది వాళ్ళకోసం మనం యిప్పటినుంచే ఏదో చెయ్యకపోతే ఎలా?

రాఘవరావు కిసుక్కున నవ్వాడు – పాయింట్ తెలిసిపోయినట్టు

ఓస్ ఇంతేనా! ఏదో బ్రహ్మాండం బద్దలు కొడతావనుకున్నాను

మనం ముందు జాగ్రత్త పడకపోతే ఎలాగండీ?

ఏవిటోయ్ నువ్వనేది? పసికూనలకు యిప్పటినుంచే పెళ్ళి ప్రయత్నాలు సాగిద్దామనా నీ ఆలోచన! సిల్లీ

అదికాదండీ పెద్దదానికి మరో ఆరేడేళ్ళ తర్వాతనైనా పెళ్ళి చెయ్యక తప్పదు కదా! ఆపైన రెండేళ్ళకు రెండో దానికీ

అబ్బ! ఏదో ఒకటి చేద్దాంలేవోయ్! ఇప్పటినుంచే లేనిపోని వర్రీ ఎందుకు?' విసుగ్గా లేచి తన మంచం మీదికి చేరాడు రాఘవరావు

ఈ విషయాన్ని అంత తేలిగ్గా భావిస్తుంటే నేనేం చెప్పేది మీకు? అంది మీనాక్షి నిష్ఠూరంగా వెంటబడి

బరువుగానే భావిస్తానుగానీ ఇకపడుకో అన్నాడు మీనాక్షి చెయ్యిగిల్లి అదేం కుదరదు మీ నిర్ణయం ఏదో నాకు యిప్పుడు చెబితేనే

ఊహించని సమస్యను ముందరపెట్టి క్షణాల్లో నిర్ణయం తెలియజెయ్యమంటే ఎలానోయ్! రేపు చెబుతాగా

నోనో! నే నొప్పుకోను సుమండీ మొండికేసింది మీనాక్షి

ఔను! నువ్వన్నట్టు ఏదో చెయ్యాలి! అన్నాడు రాఘవరావు సాలోచనగా

అవకాశం దొరికినట్లనిపించింది మీనాక్షికి

మీ పదిహేనేళ్ళ సర్వీసులో మాసం మిగల్చ గలిగిందేవిటో మనకు తెలుసు మిగల్చలేక పోవటం మన తప్పుకాదనుకోండి ఇక ముందు కూడా మన జీవితాలు యిలాగే సాగిపోవచ్చుననుకుందాం! కాని మన అవసరాల్లో తప్పకుండా మార్పొస్తుంది అప్పుడు మనం ఆలోచించటం ప్రారంబించామంటే పుణ్యకాలం అగదు అలాగని మీ అభిరుచుల్ని మానుకోమని నేను చెప్పను కాని అభిరుచులు మనల్ని ఎక్కడ నిలబెడతవో ఏదిశగా తీసుకుపోతవో అప్పుడప్పుడూ గుర్తు చేసుకోవటం మనలాంటి వాళ్ళకు చాలా ముఖ్యం ఈ విషయం చెప్పాలనే వారం రోజులనుంచి అవస్థపడు తున్నాను మీ సమయాన్ని ఇలా వృధా చేసినందుకు క్షమించండి

ఇందులో క్షమించటానికేముందిగానీ ఇవాళకు సాధన చెట్టెక్కినట్టే! ఇక పడుకుందాం! అన్నాడు రాఘవరావు

ఇంకా పదిన్నర కాలేదండీ వయొలిన్ తీసుకోండి అంది మీనాక్షి అక్కడినుంచిలేస్తూ

ఇకలాభం లేదులే

సరే మీ యిష్టం అంటూ వంట యింట్లోకి వెళ్ళిపోయింది మీనాక్షి

ఆడవాళ్ళకు ముందు చూపు ఎక్కువ అనుకున్నాడు రాఘవరావు కళ్ళు నలుపుకుంటూ అయితే తనేం చెయ్యాలో మీనాక్షి చెప్పనేలేదు! మనసులో ఏదో ఆలోచన వుండే వుంటుంది కాని, ఆభారం తనకే వదిలేసింది! ఎంతైనా స్త్రీ బుద్ధి!

ఆలోచనల ప్రవాహంలో కొట్టుకుపోతూ సీలింగ్ ఫాన్ వంక చూస్తూ పడుకున్నాడు రాఘవరావు

* * *

లంచ్ టైం!

రాఘువరావు కాంటీన్‌కు వెళ్లేసరికి రాజారావు టేబిల్ ముందు వొంటరిగా కూచుని వున్నాడు సాధారణంగా కలిసి రావల్సిన వాళ్ళు ఎంచేతో వెనకాముందయింది

ఏవిటోయ్ ముందే వచ్చేసావ్? అంటూ ఎదురుగా వెళ్ళి కూచున్నాడు రాఘువరావు

'ఔను అన్నాడు రాజారావు పరధ్యాన్నంగా

బతేవాడివే! నీకోసం చూ॥ ఐదు నిమిషాలు లేటుగా వచ్చాను అన్నాడు రాఘువరావు నవ్వుతూ

ఆ సంగతి గుర్తొచ్చే ఎదురు చూస్తున్నాను

అబద్ధం! ఏదో ఆలోచనా ప్రపంచంలో మునిగితేలుతున్నావ్

పసికట్టావే అన్నాడు రాజారావు నవ్వి

నీ పరధ్యాన్నమే నీ స్థితిని తెలుపుతుందోయ్ అన్నాడు రాఘువరావు ఏదో కనిపెట్టినట్టు

కొంతవరకు నిజమే రాఘువరావు! అదే ధ్యాసలోపడి నీరూం దాటేసి వచ్చాను' వొప్పేసుకున్నాడు రాజారావు

ఐనా యిప్పుడు జరిగిన ప్రమాదం ఏం లేదనుకో కానీ అధ్యాసేవిటో వివరింపుమ్ ఇంకాస్త నవ్వాడు రాఘువరావు

తప్పకో ముందు టిఫిన్‌కు ఆర్డరివ్వు

బేరర్‌ను పిలిచి ఆర్డరిచ్చాడు రాఘువరావు

ఏముంది రాఘువరావు మనకుండేది ఒకే ఒక సమస్య – డబ్బు! దీని దుంప తెగ – కొంతమందిని ఎందుకు పిల్చి పిప్పి చేస్తుందో మరి కొంతమందిని అలరించి అహ్లాద పరుస్తుందో బొత్తిగా అర్ధంకాదు

అర్థం కాకపోవటమే మంచిది `రాజారావు లేకపోతే ఈ భూమ్మీద మనుషులు మిగలరు

అదేవిటోయ్?

అంతే మరి! ప్రతివాడు సంపన్నుడు కావాలనుకుంటే మనిషి మనిషిని దోచుకోవాలి! పీక్కుతినాలి ఆ సంఘర్షణలో మిగిలేది మనుషులు కాదు శవాలు! అందుకే దోచుకోవటానికి కొందరికి మేతగా ఎందరెందరో ఈ భూమ్మీద సావాసం చేస్తున్నారు మనకు కూడా మొదటివర్గంలో చేరాలనే దుర్బుద్ధి పుట్టిందనుకో – మనిద్దరం ఒకర్నొకరం ఎలా నాశనం చేసుకోవాలా అని ఆలోచిస్తాం సో – సంపాదించలేక పోవటమనే విద్యలో మనం నిష్ణాతులుగా వుండటమే సమాజానికి శ్రేయస్కరం → మన ఆరోగ్యానికీ మేలు'

రాఘువరావు మాటలు తింటున్న టిఫినంత రుచిగా వున్నా బెదరగొడుతున్న డబ్బు సమస్య రాజారావును ఆ అనుభూతికి దూరం చేసింది

నువ్వు చెప్పింది కరెక్టే రాఘువరావు! కాని సంపాదించకపోతే మన సమస్యలు తీరవుగా మరి! జీతం బ్రతకటానికి తప్ప – సమస్యలను పరిష్కరించదు కోనా?

రాఘువరావు త్రుళ్ళిపడ్డాడు ఇంతవరకూ జీతం డబ్బు పరిష్కరించని సమస్యల తనకు ఎదురవ్వలేదు రాజారావుకు అనుభవంలోకి వచ్చిందన్నమాట!

ఔనని చెప్పేరోజు నాకూ రావొచ్చునేమోగానీ – నీ సమస్య చెప్పు అన్నాడు రాఘువరావు ఆరాటంగా

నీకు తెలీందేముంది మా పెద్దమ్మాయి పెళ్ళి చెయ్యాలని వరుడికోసం కాలికి బలపం కట్టుకుని తిరిగాను సంబంధమయితే కుదిరింది నీకూ చెప్పాను వాళ్ళ గొంతెమ్మకోరిక లన్నింటినీ స్టెయిల్‌గా వొప్పేసుకున్నాను తర్వాత లెక్కలు గట్టి చూసుకుంటే – ఐదంకెల్లోకి దేకింది ఖర్చు! అంటే – ఖచ్చితంగా ముప్పయివేల రూపాయలు అక్షరాల నా జేబులో వుండాలి! ఎన్నిలోన్లు పెడితే అంతయ్యేను! మనకు తెలిసిన దారి – ఆ బ్రహ్మ విద్య – అప్పు చెయ్యటం ఒక్కటే! జీవితాంతం వడ్డీలు కట్టలేక మన నడ్డి విరిగిపోతుంది మన బ్రతుకు పుస్తకంలోనుంచి శాంతి సుఖాల పేజీల్ని చించిపారెయ్యాలి! ఏమంటావ్?

అంతా విన్న తర్వాత రాఘువరావు గుడ్లు మిటకరించాడు పొగలు కక్కు ు న్న వన్‌బైటూ టీని ఒక్క గుక్కలో పీల్చేసి, స్పీడుగా సిగరెట్



ముట్టించాడు

ఏవిటోయ్ మాట్లాడవు? రాజారావు కదిలించాడు

'ఈ ప్రశ్నకూ జవాబు చెప్పేరోజు ఎప్పుడో ఒకప్పుడు రావచ్చుగానీ జీతం రాళ్ళతో తృప్తిపడి చేతులు ముడుచుకు కూచుంటే మనలాంటి బుద్ధిమంతులకు గండాలు తప్పవంటావు

'ప్రస్తుత పరిస్థితుల్ని బట్టి ఈ దేశంలోని సామాన్యుడు విశ్రాంతిని ఆశించకూడదు'

'నిద్రా సమయంలో తప్ప'

దట్సాల్'

'అన్యాయం రాజారావు!

బల్లగుద్ది మరీ అన్నాడు రాఘవరావు

ఓరి నీ ఆవేశం దొంగలుదోలా! నీకేం నేను శిక్ష వెయ్యలేదు అన్నాడు రాజారావు విడ్డూరంగా చూస్తూ

'సారీమేన్ రాఘవరావు సిగ్గుపడ్డాడు

ఐనా - సమస్య ఎదురైంది నాకు నువ్వేదో ఉపాయం చెబుతావనుకుంటే నాకంటే ఎక్కువ వణికిపోతున్నావు - నీ కూతురు పెళ్ళి చేయబోతున్నట్లు ఏవిటి సంగతి?

ఇదే సంగతి' మరి కొన్నేళ్ళ తర్వాతనైనా నేనూ ఇలాగే నీతో మొరపెట్టుకోవాల్సిందేగదా అని ఆలోచిస్తున్నాను రాజారావు!

ఒక నావలో ప్రయాణం చేస్తున్నాం మరి! ఐనా, ఆలోచించి చేయగలిగిందేవుంది?' అంటూనే బల్లమీదనుంచి లేచాడు రాజారావు

మౌనంగా రాజారావును అనుసరించాడు రాఘవరావు.

* * * * * * *

నాలుగురోజుల తర్వాత-

రాత్రి తొమ్మిది గంటలు!

వీధి గుమ్మంలో ఎదురుచూస్తూ నిల్చుంది మీనాక్షి అర్చన, వందన అప్పటిదాకా చదువుకుని పక్కలమీదికి చేరారు

సరిగ్గా ఎనిమిది గంటలకు టంచన్‌గా యింటికిచేరే రాఘవరావు ఇంకా రాలేదు పొద్దున వెళ్ళేప్పుడు ఆలశ్యంగా వస్తానని కూడా చెప్పనేలేదు పైగా కూరలు తెమ్మంది తను ఎన్ని కూరలు కొంటే మాత్రం - ఇంతసేపా? ఆఫీసులో ఏదైనా అర్జంటు పని వున్నా యింత పొద్దుపోయేది కాదు మరి

ఏపీ పాలుపోవటంలేదు మీనాక్షికి!

'ఈ రోజుల్లో బయటకు వెళ్ళిన మనిషి తిరిగి ఇంటికొచ్చేవరకూ ఏం చెప్పలేం'

పొద్దున పక్కింటి పిన్నిగారన్న మాటలు మీనాక్షి చెవుల్లో గింగురుమంటున్నై పక్కింటికి వెళ్ళి టెలిఫోన్ చేస్తే!

ఆలోచన వెనకాలే పక్కింటికి పరుగెత్తింది మీనాక్షి ఫోన్ చేసింది!

రింగ్ అవుతుంది గాని ఎవరూ రిసీవర్ ఎత్తటంలేదు

విసుగుపుట్టిందాకా రిసీవర్ పట్టుకుని నిల్చుంది మీనాక్షి!

ఫలితంలేకపోయింది.

## ఋతు చక్రం

భూగోళ పరిభ్రమణం ఆగిన,
భూగోళ భ్రమణంబే ఆగిన
భూవాసులు పడు బాధల నెవ్వరు
పూర్ణముగా వర్ణింప గల్గుదురు?
పరిభ్రమణమే లేకుండినచో
ఆ ఋతు చక్రం ఆగి పోవునట!
కమ్మని పుష్పసుశారభమ్ముతో
ఘుమ్మనిపించే వసంత ముండదు
భాను తీవ్రకర తాడనమ్ముతో
బాధలు పెట్టే గ్రీష్మ మ్ముండదు
జీవకోటి సర్వాభివృద్ధికై
జపసత్వములిడు వర్షమ్ముండదు
హృదయాహ్లాదక చంద్ర కాంతితో
ముదమొన గూర్చెడు శరత్తులుండవు
ఎముకలు కొరికే చలితో జీవుల
నేడ్పించే హేమవంతమ్ముండదు
శోకోద్దీపిత వృక్ష సంచయము
ఆకులు రాల్చే శిశిరమ్ముండదు
జీవోత్పత్తికి జీవరక్షణకు
జీవలయానికి సైతం మూలం
భువి తనలో తను తిరుగు చుండగా
రవి చుట్టును వడి తిరుగు చుంటయే!

– వసంతరావు వేంకటరావు

## దిగులేలరా ఓ రాఘవా!

తిరిగి వెళ్ళి - వంటిల్లు సర్దుకుని - లైట్లు తీసి - మళ్ళీ బయటి గుమ్మంలో కూచుంది

టైం పది కావస్తోంది!

కళ్ళమీద మగత వచ్చిపడుతోంది!

వేళకాళపోయినా నిద్ర ముంచుకొస్తోంది!

కడుపులో నూ నకనకలాడుతోంది!

క్షణాలు లెక్కపెట్టుకుంటూ కూచుంది మీనాక్షి

సరిగ్గా పదింబావుకు ఉసూరుమంటూ వచ్చి గుమ్మం దగ్గర ఆగాడు రాఘవరావు

రివ్వున లేచి నిల్చుంది మీనాక్షి

కూరల సంచీ – టిఫిన్ ఖాళ్ళు అందుకుంటూ –

ఏవిటండీ, ఇంత ఆలస్యమైంది? ఆత్రుతగా అడిగింది మీనాక్షి

సమాధానంగా ఒక నిట్టూర్పు వదిలి లోపలకు వెళ్ళాడు రాఘవరావు

ఏవిటండీ, ఏమైందీ? వెనకాలే వెళ్ళింది మీనాక్షి

రాఘవరావు బలవంతపు చిరునవ్వును అరువు తెచ్చుకుని –

'ఎందుకే అంతకంగారు! ఏమీ కాలేదులే! పిల్లలు నిద్రపోయినట్టుంది అన్నాడు సావధానంగా

'ఆలస్యమెందుకైందంటే చెప్పరేం?'

'అన్నం వడ్డించు! భోజనం చేస్తూ మాట్లాడుకుందాం' అని పెరట్లోకి వెళ్ళిపోయాడు రాఘవరావు

వడ్డన పూర్తిచేసి రాఘవరావు ఎదురుగా కూచుంది మీనాక్షి – తనూ వడ్డించుకుని

పిల్లల భవిష్యత్తును గురించి ఏం ఆలోచించారని కదూ మొన్న అడిగావు' అన్నం కలుపుతున్నాడు రాఘవరావు

'ఆ' అంది మీనాక్షి ఆసక్తిగా

'దాన్ని గురించే బాగా ఆలోచించాను

ఆలోచిస్తారని నాకూ తెలుసు' కాని ఆలస్యానికి కారణం మాత్రం చెప్పటంలేదు అంది మీనాక్షి నెయ్యివేస్తూ

'పెద్ద కారణం ఏంలేదు' అన్నాడు తలవంచుకుని

రాఘవరావు కారణం చెప్పదల్చుకోనట్టు గ్రహించింది మీనాక్షి ఆ విషయాన్ని తరచి అడగటం యిష్టంలేక –

'పోనీ – మీరు ఈ నాలుగు రోజులనుంచి వయొలిన్ సాధన మానేసారేవిటి? అదైనా చెప్పండి!

అలా అడిగావు – బావుంది మనదేశంలో – కనీసం మన తెలుగు వాళ్ళల్లో ఎంత మంది సంగీత విద్వాంసుల పేర్లు తెలుసో చెప్పు చూద్దాం!

బదులు చెప్పకుండా రాఘవరావు వైపు వింతగా చూసింది మీనాక్షి

'చెప్పు మరీ వత్తిడి చేసాడు రాఘవరావు

నాకేం తెలుసండీ! గొంతు విప్పి పాడేదాన్ని కాదు – సంగీతమంటే చెవికోసుకునే దాన్నీకాదు అపుడపుడపా రేడియోలో వినటం, సినిమాల్లో చూడటంవల్ల బాల మురళీ కృష్ణగారి పేరు మాత్రం తెలుసు మీరు ఎప్పుడూ స్మరిస్తూ వుండే ద్వారం వెంకటస్వామి నాయుడుగారి పేరు కంఠస్థమై పోయింది మూడో పేరు నన్నడగొద్దు అంటూ ముజ్జుగ పోసింది మీనాక్షి

మూడో పేరు తెలీనందుకు నువ్వేం సిగ్గుపడనక్కర్లేదోయ్! సంగీతంలో కొద్దో గొప్పో ప్రవేశమున్న వాళ్ళనడిగినా పట్టుమని పదిపేర్లు చెప్పలేరు అన్నాడు రాఘవరావు

ఆ లెక్కనైతే నేనే నయమన్నమాట

అలా అనుకున్నా తప్పులేదు కాని అసలు విషయం ఏమిటంటే ప్రసిద్ధులైన కళాకారులు నిజంగా అంతకన్నా ఎక్కువలేరు

ఆఁ ఎక్కడినుంచొస్తారు లెండి – మీ సంగీతం మీకు తప్ప నాలాంటి వాళ్ళకు అర్థమవుతుందా? అయినా శాస్త్రీయ సంగీతం విని ఆనందించే జనం ఎంత మందండీ? అంది మీనాక్షి

ఔను! ఇన్నికోట్ల జనాభాలో కొన్నివేల మంది మాత్రమే! నా విచారం శ్రోతల సంఖ్యను గూర్చికాదు వేలల్లో వున్న శ్రోతల్ని రంజింప చేయటానికి తగినంతమంది కళాకారులు తయారు కావటం లేదని

అసలీ శాస్త్రీయ సంగీతమంటే జనంలో అభిరుచే లేనప్పుడు నేర్చుకునేవాళ్ళూ తక్కువగానే వుంటారండీ! పొరపాటు! అన్నాడు రాఘవరావు ఉద్రేకంగా

కాక మరేమిటంటారు?"

రాఘవరావు మారు మాట్లాడకుండా లేచి పెరట్లో

కళ్లాడు చేతులు కడుక్కోటానికి

మీనాక్షి వంటింటి పని పూర్తి చేసుకొని వచ్చేటప్పటికి రాఘవరావు పచార్ల కార్యక్రమం ముగించుకొని హాల్లో కూర్చున్నాడు

వక్కపొడి అందిస్తూ రాఘవరావు కెదురుగా తనూ కూర్చుంది మీనాక్షి

'నా విషయమే తీసుకుందాం మీనాక్షీ!' అంటూ సంభాషణ కొనసాగించాడు రాఘవరావు

మీనాక్షి కళ్లల్లో ఉత్సుకత తొంగి చూసింది

మానాన్నగారు వయొలినిస్ట్! నాకు తెలిసినంతవరకు ఆయన హరికథలకు మాత్రమే వయొలిన్ వాయించేవాడు అంచేత చిన్నతనంలోనే నాకు అభిరుచి అంకురించింది ఆ అభిరుచి నాలో నేర్చుకోవాలనే ఆసక్తిని పెంచింది నాన్నగార్తో ఆ విషయమే ప్రస్తావించాను

ఈ సంగీతం నాకన్నా ఎక్కువ నిన్ను ఉద్ధరించదు బుద్ధిగా చదువుకో! అని నన్ను దాని జోలికి పోనివ్వలేదు

పూర్తిగా చదువుధ్యాసలో పడిపోయాను డిగ్రీ అయ్యేసరికి నాన్న పోయారు ఇహ పై చదువు మానేసి యింటి బాధ్యత నానెత్తినేసుకున్నాను ఉద్యోగం వేటలో రెండేళ్ళు కరిగిపోయాయి! ఆ సమయంలోనే స్టెనోగ్రఫీ పూర్తి చేసాను ఇక వేరే విషయం ఆలోచించటానికి అవకాశం ఎక్కడుంది? ఆ తరువాత అమ్మపోయిన రెండేళ్లకు మన పెళ్లయింది కొత్త కాపురంలోని రుచి అభిరుచిని మరిపించిందని వేరే చెప్పాలా? సరే, ఈ యిద్దరు నలుసులూ పుట్టేరి, వీళ్లని యిప్పటివరకూ పెంచటంలో నీతో పాలుపంచుకున్నాను ఊపిరి సలుపుకోవటానికి వీలులేకుండా ముప్పైఐదు సంవత్సరాల జీవితం దొర్లిపోయింది

కాస్త యిప్పుడిప్పుడే వెసులు బాటు దొరికిందని రెండేళ్ల క్రితం వయొలిన్ నేర్చుకుందామని సాయం కళాశాలలో చేరాను ఎప్పటికీ నెరవేరదనుకున్న కోరిక యిప్పటికైనా తీర్చుకోగలుగుతున్నందుకు ఎంతో సంబర పడ్డాను కానీ – మొన్నటి నీ ప్రశ్న నన్ను ఉక్కిరి బిక్కిరి చేసింది ఆలోచనలను రేపింది! పిల్లలు పెద్ద వాళ్లవుతారు వాళ్ల పెళ్ళిళ్ళు నేను చెయ్య గలనా అని దిగులు పడ్డాను కట్నాల ఊబిలో కూరుకు పోయిన మన వ్యవస్థ నన్ను కలవర పెట్టింది రాజారావు పరిస్థితి దానికి నిదర్శనం! సమస్యని వాడు భూతద్దంలో పెట్టి చూపించాడని నేననుకోలేదు కఠిన వాస్తవమే చెప్పాడని నా నమ్మకం! నా ఒక్కడి నమ్మకం కాదు మీనాక్షీ – నాలాంటి వాళ్ళు లక్షల్లో వున్నారు అందుకే కోట్లాది జనంలో కళల పట్ల అభిరుచి వున్న లక్షల్లో నుంచి వందల సంఖ్యలో మాత్రమే కళాకారులుగా జీవితం ప్రారంభించినా కొసకు మిగులుతుంది పదీ పరకా! ఆర్థిక సమస్యలతో కృంగదీసే వివాహ వ్యవస్థ కొనసాగినంత కాలం దైన్యం నిండిన జీవితంలోని విశ్రాంతి కాలాన్ని కూడా నాలాంటి వాడు అమ్ముకోక తప్పదు ఇంతకూ– సారాంశ మేమంటే – మూడు రోజుల క్రితం నుంచే వయొలిన్ ముట్టటం మానేశాను – అని గట్టిగా ఊపిరి పీల్చు కున్నాడు రాఘవరావు ఏదో బరువు దిగిపోయినట్లు

ఆ మాటతో ఖంగుతిన్నట్లైంది మీనాక్షి! అవ్యక్తంగానే ఆమె కళ్లల్లో దైన్యం చోటు చేసుకుంది తన మూలంగానే భర్త యింత తొందరగా బాధా కరమైన నిర్ణయం తీసుకొని వుంటాడని పించింది

నాతో మాట మాత్రమైనా చెప్ప లేదేమండీ? మీనాక్షి గొంతు జీర పోయింది

ఇందులో చెప్పి చేయాల్సింది ఏముంది మీనాక్షీ! నీకు ముందుగా వచ్చిన ఆలోచనలను నేను వెంటనే ఆచరణలో పెట్టాను– అంతే!

అంటే!!

దైన్యానికి తోడు మీనాక్షి స్వరానికి ఆశ్చర్యం తోడైంది

ఏముంది? ఆఫీసుకు వెళ్లినప్పటి నుంచి వదిలే దాకా ఏ పని చేస్తున్నానో తరువాత మరో మూడు గంటలు అదే పని చేయటానికి ఓ అడ్వకేట్ గారి దగ్గర కుదిరాను షార్ట్‌హేండ్ పుస్తకానికి నాకు ఎన్ని జన్మల బంధముందో మరి అంటూనే లేచి నెమ్మదిగా బెడ్‌రూం వైపు కదిలాడు రాఘవరావు

మీనాక్షి మాత్రం వెంటనే ఎందుకో అక్కడి నుంచి లేవలేక పోయింది □

# బాబే పుట్ట నవసరంలేదు

# పాఠకుల శీర్షిక
# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

మళ్ళీ పాప పుడుతుందని తెలిసినప్పటి నుండి సృజన మనస్సు ఆందోళనగా ఉంది భర్త రాగానే చెప్పింది అయితే ఏం? అన్నాడు ప్రబాకర్

అందరూ ఆడపిల్లలైతే మనకు తల కొరివిపెట్టేవాడు లేకపోతే ఎలాగండీ ఈ సారైనా బాబు నా కడుపున పడతాడను కున్నాను వద్దండీ అబార్షన్ చేయించు కుంటాను నా మాట కాదనకండీ ప్లీజ్ అని తన మనస్సులో ఉన్న బాధను చెప్పింది

పిచ్చి సృజీ తలకొరివి పెట్టడానికే అయితే మన కడుపున పుట్టనవసరం లేదే మా నాన్నగారు చనిపోయి నప్పుడు యాక్సిడెంట్ మూలంగా నేను హాస్పిటల్‌లో బెడ్‌మీద నుండి కదలలేని స్థితిలో ఉన్నానా? అప్పుడు మా నాన్న అమ్మలకు పుట్టకపోయినా దారిలో పసికందుగా దొరికితే పెంచి పెద్ద చేసిన రాజు ఆ రోజు మా



నాన్నగారికి తలకొరివి పెట్టలేదా? ఆలోచించు, పోనీ, మీ అన్నయ్య నెలకు రెండువేల జీతం తీసుకుంటున్నా మీ అమ్మ, నాన్నలకి ఒక్క నయాపైసా పంపించ కుండా ఉంటుంటే అంత, ఇంత వారికి నీవు సర్దుతూనే ఉన్నావుకదా! ఆడ పిల్లని, మగపిల్లాడని వేరుగా చూస్తే ఇప్పుడునీవుఉండేదానివా! మీ అమ్మ నాన్నలకు సహాయ పడేదానివా! చెప్పు!

ఎంతైనా! ఆడపిల్లే కదండీ

ఆడపిల్లే కావచ్చు సంపాదించేందుకు తల్లిదండ్రులను పోషించేందుకు ఆ తేడాలు ఉండనవసరం లేదు సృజి పిచ్చి పిచ్చిగా ఆలోచించకు అందరితో సమానంగా నీవూ ఉద్యోగం చేస్తున్నావు ఆ మాత్రం నీలో ఆలోచన రాలేదంటే ఏమని భావించాలో అర్థం కావటంలేదు సృజి

ఆలోచిస్తూనే మగత నిద్రలోకి జారుకుంది సృజి ప్రభాకర్ మనస్సులో నవ్వుకుని ముద్దు మోముపై ముంగురులు సవరించాడు

భానుని లేలేత కిరణాల మేలు కొలుపుతో మెలకువ వచ్చింది ప్రబాకర్‌కు సృజన తలార స్నానం చేసి, సింధూరం మోమున దిద్దుకుని కాఫీ కప్పుతో వచ్చింది దేవతలా ఉంది సృజన తన్మయంగా చూస్తూ ఉండిపోయాడు

నన్ను క్షమించండి, అనాలోచితంగా అబార్షన్ చేయించుకుంటా నన్నాను మీరన్నట్లు పాపైనా, బాబైనా ఒకటేనని గ్రహించాను తృప్తిగా అంది సృజన

కె విజయ నరసింహ్మారెడ్డి,
గుంటూరు

# "ఆడపిల్ల మైనస్సా?"

ఆడపిల్ల పుట్టిన దనగానే కుటుంబానికేదో తీరని అన్యాయం జరిగినట్లు బయపడటం బాధపడటం పరిపాటి అయిపోయింది మీకు ఆడపిల్ల పుట్టిందటగా అని పలకరించే వాళ్ళ మాటల్లో ప్రముఖంగా ధ్వనించేది సానుభూతి ఈ పరిస్థితి చూస్తుంటే సమాజంలో ఆడపిల్ల స్థాయి ఏమిటో మనం అర్థం చేసుకోవచ్చు అయితే వాస్తవంలో ఎందరో ఆడపిల్లలు యీనాడు తమ కుటుంబాలకు అండగా దిక్కుగా వుంటున్నారు కుమారుల కంటే కుమార్తెలే తల్లిదండ్రుల ఎడల తమ బాధ్యతలను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు వృద్ధాప్యంలో వారిని ఆదరిస్తున్నారు ఆదుకుంటున్నారు నాకు బాగా పరిచయమున్న రెండు కుటుంబాలలోని ఆడపిల్లలను చూస్తున్నప్పుడు అసలు ఆడపిల్లలు పుట్టడం కంటె అదృష్టం లేదేమో అనిపిస్తుంది

ఒక కుటుంబంలో పదిమంది ఆడపిల్లలు ఒక్క మగబిడ్డ కూడా లేడు పిల్ల లందరూ శ్రద్ధగా



చదువుకున్నారు తండ్రి చనిపోయిన తర్వాత ఆడపిల్లలే యింటికి దిక్కు అయినారు ఉద్యోగం చేస్తున్న అమ్మాయిలు చెల్లెళ్లను చదివించడం వారికి ఉద్యోగాలు లభించి కుటుంబ బాధ్యత తీసుకోగానే పెద్ద వారికి పెళ్ళిళ్ళు జరిపించడం జరిగింది ప్రతి ఒక్కరూ డిగ్రీ అంతకు మించిన చదువే చదివారు దాదాపు అందరూ ప్రభుత్వ ఉద్యోగాలలో వున్నారు చక్కగా పెళ్ళిళ్ళు చేసుకుని కాపురాలు చేసుకుంటున్నారు ●




తల్లిని అపురూపంగా చూసుకుంటారు ఆడపిల్లలుగా పుట్టినందుకు వాళ్ళుకానీ వాళ్లను కన్నందుకు ఆ తల్లిగానీ ఎప్పుడూ చింతించలేదు

ఇంకో కుటుంబంలో యిద్దరు మగబిడ్డలు ఓ అమ్మాయి ప్రేమించి పెళ్లి చేసుకున్న పెద్ద కొడుకు తల్లిదండ్రులకు దూరంగా వెళ్లిపోతే, చదువు అబ్బని రెండో కుర్రాడు వుండీ లేనివాడి కింద తయారయ్యాడు ఆ వృద్ధ దంపతులను యిప్పుడు పోషిస్తున్నది ఆ కూతురే! ఎగఃంతా సూపర్ మార్కెట్టులో పని చేస్తూ రాత్రిళ్ళు యింటి దగ్గర పిల్లలకు ట్యూషన్ చెపుతూ ఆ అమ్మాయి పడుతున్న శ్రమ అయ్యో! అనిపించక మానదు ఈ విధంగా ఎందరో ఆడపిల్లలు కుటుంబ భారాన్ని స్వీకరించి ఆర్థికంగా ఆదుకుంటున్న యీ రోజుల్లో కూడ ఆడపిల్ల మైనస్ అని తెల్పడం సబబు కాదు సభ్యత కాదు!

– ఇ టి రామారావు,
శ్రీహరికోట



# శపథం

పోస్ట్! అన్న కేకతో పేపరు చదువుతున్న రాఘవయ్య తలెత్తి చూసాడు మనకు ఉత్తరాలు రాసే వారెవరబ్బా! అని స్వగతంగా అనుకుంటూ, గుమ్మం దగ్గర పడున్న ఉత్తరాన్ని తీసుకున్నాడు

రాఘవయ్యకు ఇద్దరు కుమార్తెలు పెద్దమ్మాయిని బాంక్ ఆఫీసర్ చేసాడు చిన్నమ్మాయిని ఐ ఏ యస్ చదివించాడు చిన్నమ్మాయి పేరున ఏదో కాల్ లిటర్ వచ్చింది ఆ లిటర్ని పూర్తిగా చదివి

ఒసేవ్! ఇలా త్వరగా రావే, అంటూ పిలిచాడు భార్యను

ఎమిటి పిలిచారు అంటూ వంటింట్లోంచి వచ్చింది కాంతం

చిన్నమ్మాయిని, వరంగల్‌లో అసిస్టెంట్ కలక్టర్‌గా అపాయింట్ చేసారు అని ఆనందంతో చెప్పాడు

తమ ఇద్దరు కుమార్తెలు ప్రయోజకులైనని కాసేపు సంతోష సాగరంలో మునిగి పోయారా దంపతులు

'ఏమండి నిజంగానే మన అమ్మాయి తన శపథం నెరవేర్చుకుందండి

శపథం ఏమిటే' అంటూ ఆశ్చర్యం వ్యక్తం చేసారు రాఘవయ్య

మనకు రెండో సారి కూడా ఆడపిల్ల పుడుతుందని డాక్టర్ చెప్పినప్పుడు మీరు ఆనందించారు కాని నాకు మాత్రం నిరాశే మిగిలింది ఎందుకంటె నాకు మగ పిల్లవాడు కావాలని ఎంతో ఇదిగా ఉండేది అప్పుడు నేను అబార్షన్ చేయించుకుంటానంటే, మీరు ఆడపిల్లైన మగపిల్లవాడైన ఒకటే అని చెప్పారు నేను వినక పోయేసరికి మీరు కోపంతో బయటకు వెళ్ళిపోయారు అప్పుడు నా కడుపులో ఉన్న మన చిన్న అమ్మాయి ఏమందో తెలుసాండి

అమ్మా! నన్ను చంపకమ్మ నేను బుద్ధిగా చదువుకొని, పెద్ద అయ్యాక నీకు భారం కానని శపథం చేస్తున్నానమ్మ! ప్లీజ్! నన్ను చంపకమ్మ అంటూ రోదించసాగింది అప్పుడు నా మనసు తేలిక పడింది కాని ఇప్పుడు ఎవరెస్ట్ శిఖరం ఎక్కినంత సంబరంగా ఉందండి

ఏది ఏమైన ఆడపిల్లలు వద్దు అనుకునే నేటి తల్లులకు మన రత్నాలు, అదే మన అమ్మాయిలు మంచి ఉదాహరణలు

-టి పద్మజ, హన్మకొండ,
(వరంగల్)

# మీరూ ఆలోచించండి

గత దశాబ్దం ప్రారంభంలో కేవలం అధిక సంతాన నిరోధం కోసం ప్రారంభమైన కుటుంబ నియంత్రణ పద్ధతులు ఈ రోజుకు సాధించిన అభివృద్ధి గణనీయమైనది ప్రస్తుత కాలంలో పుట్టిన బిడ్డ ఎవరైనా ఒకటేనని భావించాలి అతి సంతానం దేశ పురోభివృద్ధికి గొడ్డలి పెట్టు వంటిది చేతులు కాలిన తర్వాత అనే సామెత నిజం కాకముందే జాగ్రత్త పడితే మంచిది నేటి పరిస్థితులలోఎస్ డి టి (సెక్స్ డిటర్మినేషన్ టెస్ట్) ద్వారా ఆడపిల్ల కలుగుతుంది అని తెలిసినా బయపడనవసరం లేదు ఎవరు పుట్టినా సక్రమమైన రీతిలో పెంచ గలిగి, వారిని చదివించ గలిగితే చాలు చదువు పూర్తి అయ్యాక వారి కాళ్లపై వాళ్ళు నిలబడగలుగుతారు ఆ తర్వాత వారి ఉద్దేశ్యాలకు అబిరుచులకు అనుగుణంగా కావలసిన వారిని నిర్భయంగా వివాహం చేసుకోగలరు తద్వారా వరకట్న సమస్య కూడా తీరుతుంది

ఎస్ డి టి ద్వారా కలుగబోయే బిడ్డలను కూడా కేవలం తమ స్వార్థానికి అనుకూలంగా మార్చుకొనే దంపతులు ఒక్కసారి ఆలోచించాలి అలాంటి వారికి కేవలం మగపిల్లలే కలిగినా వారి వల్ల ఎవరికీ ఉపయోగం ఉండదు ఎందుకంటే బిడ్డలను కనబోయే ముందే ఇంత స్వార్థంగా సంకుచితంగా స్త్రీ శిశు హత్య చేసే వారు వారికి కల్గిన మగ బిడ్డలను పెంచే విధానం మాత్రం బాగుంటుందా? కేవలం వారి బిడ్డలను సొంత వక్తిత్వం లేని వారిగా మాత్రమే తీర్చి దిద్దగలుగుతారు ఇలాంటి తల్లిదండ్రులు వారి మగబిడ్డల ద్వారా వారికే కాక, దేశానికి కూడా ఏవిధమైన ఉపయోగం ఉండదని తెలుసుకోవాలి పిల్లలు పెద్దవారయ్యాక వారికి ఈ విషయం తెలిస్తే ఈ తల్లి దండ్రులకు ఎంత విలువ ఇస్తారో ఒక్కసారి ఆలోచించండి

ప్రతి ఒక్కరూ వారి కుటుంబ ఆదాయాన్ని బట్టి ఒకరు లేక ఇద్దరు పిల్లలు తర్వాత కుటుంబ నియంత్రణ అవలంబించాలి పుట్టిన బిడ్డలు ఎవరైనా వారి బవిష్యత్తుని చక్కగా తీర్చి దిద్దాలి వారి అబిరుచులను బట్టి విద్యాబ్యాసం చేయిస్తే తప్పక వృద్ధిలోకి వస్తారు శిశు హత్య పాపమని, కేవలం స్త్రీ శిశుహత్య మహా పాపమని బావించాలి నేటి శిశువులే బావి భారత సౌబాగ్య సోపాన నిర్మాతలని గ్రహించాలి

–జంపని శ్రీ దుర్గాశంకర్,
బికనీర్, రాజస్థాన్ □




కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు ____________________

____________________

పూర్తి చిరునామా ____________________

పిన్ కోడ్ ____________________

సీరియల్

# ప్రతిస్పందన



Bala

'అన్నపూర్ణ'

(గత సంచిక తరువాయి)

తన పెద్దకూతురు సాకేత బి ఎ ఫస్ట్క్లాస్‌లో ప్యాసైన సందర్భాన్ని పురస్కరించుకొని తమ యింటికి భోజనానికి పిలిచాడు నిరంజనరావు అనిరుద్ధ్‌ను

ఎవరి మీద కోపం పంతాలు పట్టింపులు లేని అనిరుద్ధ్ మామయ్య ఆహ్వానానికి ఆనందంగా అంగీకరించి వచ్చాడు

కష్టించి చదివి ఫలితం సాధించినందుకు సాకేతను మనస్ఫూర్తిగా అభినందించాడు అనిరుద్ధ్

థాంక్స్ పొడిగా కృతజ్ఞతలు తెలిపి వూరుకుంది సాకేత

నిజానికి ఆవేళ ఆదివారం శలవు అవటం మూలాన పగలే భోజనానికి వచ్చాడు భోజనం చేసి తన గదికి వెళ్ళబోయే ముందు, నువ్వు వేరేవిధంగా భావించుకోనంటే ఒకసారి మా రూమ్‌కు రా నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి అన్నాడు అనిరుద్ధ్

తనతో 'మాటలా'

సాకేతా, నిన్ను నేను ప్రేమిస్తున్నాను నన్ను పెళ్ళి చేసుకోక పోతే ఆత్మహత్య చేసుకుంటాను' అని అంటాడా పిచ్చి రవికిరణ్‌లా?

పాపం! తనని చేసుకోవాలని ఎంత ఆశ?

కాకి ముక్కుకు దొండపండట ఎప్పుడైనా అద్దంలో ముఖం చూసుకున్నాడో లేదో? లేకపోతే తన వంటి అందమైన దానిపై ఆశలు ఎందుకు పెంచుకుంటాడు? పైగా రచయితట రచయిత అన్నవాడు తన మేధస్సుతో ఎదుటి మనసులను ఇట్టే కనిపెట్టేయాలి మరి ఈ అనిరుద్ధేమిటి? తను ఎన్ని విధాల తన అయిష్టతను తెలియజేసినా అర్థం చేసుకో లేకుండా వున్నాడు? అర్థం చేసుకుంటే ఇంకా తనతో మాట లేమిటి?

లేదు రవికిరణ్‌లా ఇతడూ ఏవో అనవసరమైన ఆశలు పెంచుకుంటు న్నట్టున్నాడు

ఆ ఆశలన్నీ కేవలం భ్రమలని తను తెలియ జెప్పటం అవసరం

తనంతట తానే అడుగుతున్నాడు కాబట్టి అతడి రూమ్‌కి ఒకసారి వెళ్ళటమే మంచిది

—అహంకార పూరిత హృదయంతో ఆలోచించి అలాగే సాయంత్రం వస్తాను అంది చివరికి

సాకేత వైపు అదోలా చూసి ముసి ముసిగా నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు అనిరుద్ధ్

అతడి ఆ చూపులు ఎంతసేపు ఆలోచించినా అంతు బట్టలేదు మిస్ సాకేత బి ఎ కు

* * * * * * * * *

రకరకాల వూహలతో సాయంత్రం అయిదు గంటల ప్రాంతంలో అనిరుద్ధ్ గదికి వచ్చింది సాకేత

అప్పుడు చంద్రిక అక్కడే వుంది స్టౌముందు కూర్చుని కాఫీ తయారు చేస్తోంది

ఏదో వారపత్రిక తిరగవేస్తూ కుర్చీపీటమీద కూర్చుని వున్నాడు అనిరుద్ధ్

'ఓ సాకేతా! కమాన్ రావేమో అనుకున్నాను మొత్తానికి నా మాట మీద గౌరవం వుంచి వచ్చావ్ అందుకు థాంక్స్ చెప్పుకుంటున్నాను అని కుర్చీపీట సాకేతకు యిచ్చి తాను మంచం మీద కూర్చున్నాడు అనిరుద్ధ్

ఏం మాట్లాడాలో తోచనట్టుండి పోయింది సాకేత

'మా అక్క ప్రప్రథమంగా నీ గదిలో కాలు మోపింది ఈ యిల్లు పవిత్ర మై పోయినట్టే బావా' అంటూ జోక్ చేసింది చంద్రిక అనిరుద్ధ్ సన్నగా నవ్వాడు

చంద్రికను ఏమీ అనలేక చురచుర చూసింది అదే తమ యింటి దగ్గరయితే చెల్లెల్ని ఇష్టం వచ్చినట్టు తిట్టేసేది కొత్త చోటు కనుక ఏమీ అనలేక పోతోంది

అక్కయ్యకు కోపం రానే వచ్చేసింది నామీద ఈ కాఫీ త్రాగి నేను అన్న మాటలు మర్చిపో అంటూ – రెండు కాఫీ కప్పులు తెచ్చి ఒకటి అనిరుద్ధ్‌కు ఒకటి సాకేతకు యిచ్చింది

తర్వాత తాను కూడా కాఫీత్రాగి మీరిద్దరూ మాట్లాడు కొంటూండండి నేను ఓ ఫ్రెండ్ ఇంటికెళ్ళి రావాలి. చాలా అర్జంట్ అని చెప్పి చంద్రిక

**జరిగిన కథ —6 : సాకేతతో నిరాకరించబడి ప్రతీకార వాంఛ పెంచుకుంటాడు రవికిరణ్ సాకేత మేన బావ అనిరుద్ధ్ శేషాద్రి కంపెనీలో ఉద్యోగంలో చేరుతాడు 'సమాజ సత్యం' పేరుతో రచనలు చేసే అనిరుద్ధ్‌ను అభిమానించే పాఠకురాలు శేషాద్రి కూతురూ, రవికిరణ్ చెల్లెలూ అయిన సౌందర్య సాకేత మీద వశీకరణ మంత్రాన్ని ప్రయోగించడానికి రవికిరణ్ ప్రయత్నిస్తుంటాడు అనిరుద్ధ్ పట్ల సాకేత అయిష్టాన్ని కనబరుస్తుంది డిగ్రీ పాసయిన సందర్భంగా పార్టీ పేరుతో ఇంటికి ఆహ్వానించి మత్తు మందు ఇచ్చి సాకేత తల వెంట్రుకలు సంపాదిస్తాడు రవికిరణ్ వాటితో ప్రయోగం ప్రారంభిస్తాడు**

తుర్రుమంది అక్కణ్ణుంచి

ఇప్పుడు అక్కడ సాకేత అనిరుద్ధ్- ఇద్దరే వున్నారు

కొద్దిసేపు ఎమని మాట్లాడాలి ఎలా ప్రారంభించాలి- అన్న విషయం తోచనట్లు వూరుకుండి పోయారు ఇద్దరూను

చివరికి అనిరుద్ధే చొరవ తీసుకున్నాడు

నాపట్ల నీ అభిప్రాయమేమిటి సాకేతా?

చిత్రంగా చూసింది సాకేత అంతా తానూహించి నట్లే జరుగుతోంది అనిపించింది ఆమెకు

ప్రత్యేకమైన అభిప్రాయం అంటూ ఎదీలేదు అంది

నేనీ వూరు ఎందుకు వచ్చాను? -ప్రశ్నించాడు

ఉద్యోగరీత్యా వచ్చాను తెలియని వూరు బంధువులు మీరు వున్నారని చెబితే తాత్కాలికంగా ఆశ్రయం పొందటానికి మీ యింటికి వచ్చాను

నేను ఒకందుకు వస్తే మీరంతా వేరేవిదంగా వూహించుకున్నారు ముఖ్యంగ నువ్వు – నేనేదో పెళ్ళి చూపులకు వచ్చినట్లు బావించు కున్నావ్ అసలు మీ యింట్లో అంతా అలా ఎందుకు ఆలోచించారు?

అదీనేనే చెబుతాను ఆడపిల్లల్ని కన్న తల్లిదండ్రులుగా మీ అమ్మ నాన్న వీక్‌నెస్ కు పోయారు వరుస అయిన కుర్రవాళ్ళు కనిపిస్తే చాలు- ప్రతి సగటు తల్లి తండ్రి తమ అమ్మాయిల పెళ్ళిగురించే ఆలోచిస్తారు అలాగే నన్ను గురించీ ఆలోచించి వాళ్ళకు వాళ్ళు ఎవో వూహించుకుని వుంటారు అనిరుద్ధ్ పట్ల నీ అభిప్రాయమేమిటి? అని నిన్నూ అడిగి వుండొచ్చు ఇంతకూ నా ఆలోచన ఎమిటో ఎవరికీ తెలియదు వివాహం విషయంలో నాకు కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలు వున్నయ్ వాట్ని పణంగా పెట్టివుంటే పాతిక వేలో యాభై వేలో కట్నం తీసుకొని ఎప్పుడో పెళ్ళి చేసుకొని వుండే వాణ్ణి

"కావచ్చు మా అమ్మ నాన్న పొరబాటుగా ఆలోచించారు

అది వాళ్ళ పొరబాటు అని నేను నిందించను అది నేటి కాల మాన పరిస్థితులను బట్టి- ఆడపిల్ల కన్న తల్లిదండ్రులుగా సహజంగానే ఆలోచించారు తెలియక వాళ్ళేదో వూహించారు మరినువ్వు? బాగా చదువుకొని వుండీ నన్ను తేలిగ్గా ఎందుకు అంచనా వేశావు? పైగా చంద్రికను కూడా మా యింటికి రావద్దని చెప్పావుట! నేనంత హృదయం లేని మనిషి ననుకున్నావా? కల్లాకపటం ఎరుగని స్వచ్ఛమైన మనసు చంద్రికది నేనూ ఇది పద్ధతి కాదు నువ్వు రోజూ ఇలా నా గదికి రావటం గంటలతరబడి వుండటం మంచిదికాదని చెబుతూనే వున్నాను లోకులు పలుకాకులు మనలో లోపం లేనప్పుడు ఎవరేమనుకుంటే ఏం బావా? అంటూ నా మాటల్ని కొట్టి పారేస్తోంది తరచి ఆలోచిస్తే నాకూ అంతే అనిపిస్తోంది



# ప్రతిస్పందన

సాకేతా! నేనంటే ఏమిటో నా అభిప్రాయా లేమిటో నీకు తెలియవు అందుకే స్వతంత్రించి నిన్ను నా గదికి పిలిచాను మాట తీసి వేయకుండా నువ్వు వచ్చావు నాకు సంతోషంగా వుంది చివరిగా నా అభ్యర్థన ఏమిటంటే - నన్నూ ఓ బందువుగా సాటి మనిషిగా గుర్తించి మసులుకో నేను నీకు శ్రేయోబిలాషినే గాని కీడెంచే మనిషినిగాను ఆదర్శాలను బలిపెట్టుకొని జీవితాలను నరకం చేసుకోవాలని మనసున్న మనుషులు ఎవరూ కోరుకోరు మనమూ అంతే!

అనిరుధ్ అభిప్రాయాలు తెలిసిన తర్వాత - ఇంత కాలం తన మొరటు ప్రవర్తనకు కించిత్ పశ్చాత్తాప పడింది సాకేత

నేను పొరబాటుగా ఆలోచించాను బావా నీ మనోగత అభిప్రాయాలు నీవు మా యింటికి వచ్చిన రోజే తెలిస్తే ఎంత బావుండేది నీవు వూహించినట్లే మా అమ్మా నాన్న నాకు ఇతడే నీ కాబోయే భర్త అన్న అభిప్రాయం కలిగించారు అందుకే నేను రియాక్ట్ అయ్యాను ఇక చంద్రిక -దాని బ్రతుకు దానిష్టం ఓ రచయితగా నిన్ను నేను నమ్ముతున్నాను - అంటూ పైకి చెప్పింది

చంద్రికలా స్వతంత్రంగా నీవూ నా గదికి రావచ్చు సాకేతా నీ ఫ్రండ్ సౌందర్య ఎన్నో సార్లు వచ్చింది ఇక్కడికి

అవును చెప్పింది నీదగ్గిర చాలా పుస్తకాలు వున్నాయటగా?

-వాళ్ళిద్దరూ మాట్లాడు కొంటుండగానే అనుకోని అతిథిలా వచ్చింది సౌందర్య అక్కడికి

అనిరుధ్ రూమ్‌లో సాకేత వుండటం- ప్రపంచంలోని అన్ని వింతల్లోకి వింత అనిపించింది సౌందర్యకు ఆ క్షణంలో!

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

రవికిరణ్ మనసు ఒకటే ఆరాట పడి పోతోంది

ఎందుకంటే అష్ట కష్టాలకు ఓర్చి బ్రబక్ ప్రక్రియ జరిపి అప్పుడే మూడు రోజులు అయిపోయింది

ముప్పై ఆరు గంటల్లో ప్రబావం చూప వలసింది అలాంటిది మూడు రోజులు గడిచి పోయాయి కానీ సాకేతలో లక్షణాలు మారిన దాఖలాలులేవు మతి చెదరి తనని వెతుక్కుంటూ వచ్చే సూచనలు అంతకంటే కనిపించటం లేదు

బ్రబక్ విద్యను ప్రయోగించటంలో తనేమైనా పొరబాటు చేశాడా?

లేదే! బ్రబక్ భద్రకాళి నవలలో హీరో ఆ విద్యకు సంబందించి ఎలాంటి ప్రక్రియ జరిపాడో - అచ్చు తనూ అలాగే - అదే టైమ్‌లో చేశాడు! నవలలో హీరోయిన్ ప్రక్రియ జరిపిన ముప్పై అరుగంటల్లోనే బ్రబక్ విద్యకు వశమై పోయింది! మరి మూడు రోజులు గడిచి పోయినా ఆ బ్రబక్ విద్య సాకేతను వశపరుచుకో లేక పోయిందేమిటి?




ఆలోచిస్తున్న కొద్దీ మతి చెదరి పోతోంది రవికిరణ్‌కు

ఎంతసేపూ నవలలో జరిగిందానికీ తను చేసిన దానికీ పోల్చుకోవటంతోనే గడిచి పోతోంది

యథార్థానికి రవికిరణ్ ఇప్పుడు దాదాపు మంచంలోనే వున్నాడు

ఆరోజు బ్రబక్ ప్రక్రియ జరిపి వచ్చి వళ్ళు తెలియకుండా నిద్ర పోయాడు

ఉదయం ఎనిమిది గంటలైనా కొడుకు డాబామీంచి క్రిందికి రాక పోవటంతో యమునాదేవి పైకి వచ్చింది

బాబీ! అంత ఎండెక్కి తే ఇంకా పడుకొనే వున్నావ్? లేచిరా అని చెప్పి తిరిగి ఆవిడ క్రిందికి వెళ్ళి పోయింది

తప్పదన్నట్లే లేచాడు రవికిరణ్

ఒళ్ళంతా ఒకటే నెప్పులు అరిచేతులు బొబ్బలెక్కి పోయాయి రాత్రి ఎదో గుచ్చుకున్న కాలు కూడా బాదపెడుతోంది

కాలు నెప్పి అంటేను చేతులకు బొబ్బలంటేనూ -- మమ్మీ డాడీలకు అనుమానం వచ్చేస్తుంది

రాత్రి ఎక్కడకు వెళ్ళావ్? ఎం చేశావ్? అని యక్ష ప్రశ్నలు వేసి చంపుతారు ఇవేవీ వాళ్ళు గమనించకుండా జాగ్రత్త పడాలి

ఎయిర్ బ్యాగ్ టార్చిలైట్ కాలిజోళ్ళు - అన్నీ పోయాయి వాట్ని ఏదో విదంగా కవర్ చెయ్యాలి అవసరమైతే కొత్తవే కొనేసి తెచ్చి పెట్టాలి

స్నానం చేసి వచ్చాక బాబీ! టిఫిన్ చేద్దువుగానిరా అని యమునాదేవి అంటే తన చేతులు తల్లి ఎక్కడ చూసేస్తుందో నని నాకేమి తినాలనిపించటం లేదు వద్దు మమ్మీ అని గదిలో కెళ్ళి కూర్చున్నాడు

ఒళ్ళంతా అదోలా వుంది రవికిరణ్‌కు

తండ్రి ఆఫీసుకు వెళ్ళిన తర్వాత గదిలోంచి బయటికి వచ్చాడు

బజారుకు వెళ్దామంటే కాళ్ళకు జోళ్ళు లేవు జోళ్ళు లేకుండా వెళ్తే చూసిన వాళ్ళు నవ్వుతారు

పూర్తిగా అరిగిపోయి ఎక్కడో మూలన పడేసిన పాత జోళ్ళు తీసుకొని కాళ్ళకు తగిలించుకున్నాడు

మమ్మీ నేనలా బజారుకు వెళ్తున్నాను అంటూ వీదిలోకి నడిచాడు

స్నానం చేసిన తర్వాత వంటి నెప్పులు ఎక్కువైనట్లు అనిపించింది కాలు కూడా బాధిస్తూనే వుంది

ముందు డైరెక్ట్‌గా చెప్పుల షాపుకు వెళ్ళి మంచి చెప్పుల జత కొన్నాడు

తర్వాత - ఎవరో స్నేహితుడు ఎప్పుడో చెప్పిన విషయం గుర్తు వచ్చింది ఓ పెగ్గు వేసుకొంటే ఒంట్లో వున్న అన్ని నెప్పులూ తగ్గి పోతయ్‌ట అందుకని ప్రస్తుతం తన వంటి నెప్పులు పోగొట్టు కోవటం కోసమని ఓ ఫేమస్ బార్ అండ్ రెస్టారెంట్‌లోకి నడిచాడు

తను త్రాగి ఇంటికి వెళ్తే గొడవ అవుతుందని బార్ నుంచీ తిన్నగా ఓ సినిమా థియేటర్‌లోకి చొరబడ్డాడు

ఒళ్ళు నెప్పులు తగ్గటం మాటేమో గాని ఆ రాత్రే కొంచెం జ్వరం తగిలినట్లనిపించింది

పగలల్లా భోజనం చేయలేదు కాస్త అన్నంతిని పడుకో బాబీ అని బ్రతిమి లాడింది యమునాదేవి వచ్చి

భోజనం వద్దు మమ్మీ ఓపిక వుంటే చపాతీలు చేసి పెట్టు అన్నాడు

అలాగే అంటూ వెళ్ళి అప్పటి కప్పుడు చపాతీలు చేసింది యమునాదేవి

అవి తినేటప్పుడు రవికిరణ్ గుట్టు బయట పడింది

అరచేతులు అలా బొబ్బలెక్కాయేం బాబీ? అడిగింది కొంచెం ఆందోళనగా

మా ఫ్రండ్స్‌తో కలిసి లేబర్ కాలనీలో శ్రమదానానికి వెళ్ళాను మమ్మీ తీయగా అబద్ధమాడాడు తర్వాత, ఈ విషయం డాడీకి చెప్పకు మమ్మీ ఆలోచించకుండా చివాట్లు పెడతారు ఆయన అంటూ బ్రతిమలాడాడు సరే అని మాట యిచ్చింది యమునాదేవి

మర్నాడు వుదయానికి జ్వరం అనిపించక పోయినా ఇనుప వస్తువు గుచ్చుకున్న కాలు - పాదం కొంచెం వాచినట్లు అనిపించింది అయినా పెద్దగా

పట్టించు కోలేదు

అతడి మనసు నిండా సాకేతకు సంబంధించిన ఆలోచనే

ముప్పై ఆరు గంటలే కాదు– మూడు రోజులు కూడా గడిచి పోయాయి

బ్రబక్ విద్యకు సంబంధించి – ఎలాంటి ప్రభావం కనిపించలేదు.

ఇలా జరిగిందేమిటి?

ఆరోజు ప్రక్రియ పూర్తి అయిన తర్వాత పిచ్చిగా అరుచుకొంటూ వచ్చి తన మీద రాయి విసిరింది భద్రకాళిదేవతా?

ఆదేవతకు తనపై కోపమా? అయినా తనేం అపచారం చేశాడు?

పోనీ రచయిత భవంత ప్రసాద్ గార్కి జరిగినదంతా తెలియ జేస్తూ ఉత్తరం వ్రాస్తే?

బ్రబక్ ప్రక్రియకు సంబంధించి ఆయన ఏమైనా సూచనలు యిస్తారేమో?

ఇవ్వొచ్చు ఇదీ మంచి ఆలోచనే

ఏది ఏమైనా సరే తను సాకేతను వదిలిపెట్ట కూడదు

తనని అవమాన పరిచింది దానికి రెండింతలు ఆమెను ఫరాభవించాలి

భవంత్ ప్రసాద్ గారి నుంచీ తగిన సూచనలు అందాక తిరిగి పకడ్బందీగా బ్రబక్ ప్రక్రియను నిర్వహించాలి

ముందు రచయిత అడ్రసు సంపాదించాలి

అడ్రసు తెలియగానే ఆయనకు ఉత్తరం వ్రాయాలి అన్ననిర్ణయానికి వచ్చాడు

మొదటి రోజు కొద్దిగా వున్న కాలి వాపు రోజు రోజుకూ ఎక్కువ అవుతోంది

'గోరుతో పోయే దానికి గొడ్డలి ఉపయోగించినట్లు వ్యవహరిస్తున్నాడు రవికిరణ్

అన్నీ సెంటిమెంట్సే అతడివి

చిన్నప్పుడు ఒకసారి కాలికి మేకు గుచ్చుకొంది ఆటలకు వెళ్ళినప్పుడు తల్లి దండ్రి ఏమంటారోనని ఇంట్లో చెప్పలేదు ఎలాంటి మందు వాడకుండా దానంతట అదే తగ్గి పోయింది అప్పుడు – ఆవిషయం బాగా గుర్తుంది

ఇప్పుడు కూడా అలాగే తగ్గి పోతుంది అయినా కాలిలో దిగబడిన వస్తువును లాగి పారేశాడు కద? ఇంకేం చేస్తుంది?– అన్నది అతడి ధీమా

* * * * * * * * * *

ఆలోచన వచ్చిందే తడవుగా స్థానికంగా వున్న ప్రముఖ పత్రికల ఆఫీసులకు వెళ్ళి రచయిత భవంతప్రసాద్‌గారి అడ్రసు తెలుసుకోవటానికి ప్రయత్నించాడు

కానీ ఏ పత్రిక ఆఫీసు వారూ రచయిత అడ్రసు ఇవ్వలేదు

ఒక పత్రికవారు మాత్రం రచయిత గార్కి ఉత్తరం వ్రాయాలని మీకు అంత వుబలాటంగా వుంటే ఆయన పేరుతో కేరాఫ్ మా అడ్రసుకు వ్రాయండి మేం దాన్ని రచయితకు రీడైరెక్ట్ చేస్తాం' అని సలహా యిచ్చారు

మహద్భాగ్యం అనుకొని వచ్చేశాడు రవికిరణ్

వూరంతా తిరిగి వచ్చేసరికి కాలు మరి కొంత వాచింది. నడుస్తుంటే విపరీతమైన బాధ కలుగుతోంది కాలి జోడు కూడా పట్టటం లేదు

'తప్పదు రేపు డాక్టర్ దగ్గిరికి వెళ్ళాలి' అనుకున్నాడు

ఒక వైపు కాలు బాధ పెడుతున్నా మరో వైపు రచయిత భవంత ప్రసాద్‌కు వ్రాయవలసిన ఉత్తరం గురించే ఆలోచిస్తున్నాడు

అసలు ఆ ఉత్తరాన్ని ఎలా ప్రారంభించాలి? ఎలా ముగించాలి?

ఆ రాత్రల్లా వ్రాయవలసిన ఉత్తరం గురించే ఆలోచించాడు. చివరికి ధైర్యం చేసి ఉత్తరం వ్రాసి అప్పటికప్పుడు తమ యింటికి దగ్గిరిలో వున్న పోస్టు డబ్బాలో వేసి వచ్చాడు

తెల్లవారి లేచేసరికి కాలి నెప్పి తీవ్రమైనట్లనిపించింది అడుగు తీసి అడుగు పెట్టాలంటే నరకయాతనగా వుంటోంది

కుంటుకుంటూ నడుస్తున్న కొడుకును మొదట యమునాదేవే గమనించింది

"ఏమైంది బాబీ అంటూ అతడి కాళ్ళ వైపు చూసింది ఎడమ కాలి పాదం బాగా వాచి కనిపించింది

కాలు అలా వాచిందేమిటి?' – ఆందోళనగా అడిగింది

మేకు దిగబడింది అన్నాడు,

ఎప్పుడు?'

అయిదు రోజులనాడు అని చెబితే డాక్టర్ దగ్గిరికి వెళ్ళకుండా ఎందుకు అశ్రద్ధ చేశావ్? అని చివాట్లు పెడుతుంది మమ్మీ అని నిన్ననే మమ్మీ అని అబద్ధమాడాడు

యమునాదేవి వెళ్ళి శేషాద్రిగారికి చెప్పింది ఆయన వచ్చి రవికిరణ్ కాలు చూసి ఇలా వాచిందేమిటి? చదువుతో పాటే అన్ని విషయాల్లోనూ అశ్రద్ధ కనపరిస్తే ఎలా బాబీ? మేకు గుచ్చుకోగానే డాక్టర్ దగ్గిరికి వెళ్ళి యాంటిసెప్టిక్ ఇంజక్షన్ తీసుకోకపోయావా? అన్నాడు

పొరబాటై పోయింది అశ్రద్ధ చేశాను డాడీ' – నిజమైన పరితాపంతోనే అన్నాడు రవికిరణ్

– తను పట్టి సెంటిమెంటల్ ఫూల్ ఎప్పుడో ఏమి కాలేదనీ ఇప్పుడూ అంతేననీ –మూర్ఖంగా ఆలోచించాడు ఇనుప వస్తువు కాలిలో దిగబడిన – ఆ రోజే తను డాక్టర్ దగ్గిరికి వెళ్తే ఈ రోజు ఈ అవస్థ ఎదురయ్యేదే కాదు కద?

ఇప్పుడు ఈ కాలు చూసి ఏమంటాడో డాక్టర్? – గుబులు మొదలైంది అతడిలో




* * * *

కాలిలో ఇనుప వస్తువు దిగబడిందెప్పుడు? అడిగాడు డాక్టర్ పూర్తి పరీక్షలు జరిపి

అయిదు రోజులైందని చెబుదామనుకున్నాడు రవికిరణ్ కానీ ప్రక్కనే తండ్రి వుండటంతో నిన్ననే డాక్టర్ అని చెప్పాడు

అబద్ధం ... మేకు నిన్ననే దిగబడితే పాదం ఈ రోజుకు ఇంత వాయదు అని 'చూడండి శేషాద్రిగారూ మీరు నాకు బాగా తెలిసిన వారు అందుకని అబద్ధం చెప్పలేను. అన్నాడు డాక్టర్

ఏమిటో చెప్పండి, ? అన్నాడు శేషాద్రి ఆతృత కొద్దీ

'రవికిరణ్ కాలు సెప్టిక్ అయింది! మీ వాడు ఎందువల్లో అబద్ధం చెబుతున్నాడు కానీ, ఇనుప వస్తువు కాలికి గుచ్చుకొని నాలుగయిదు రోజులు అయి వుంటుంది గుచ్చుకున్నది కూడా బాగా తుప్పు పట్టిన వస్తువై యుండాలి,

కాలు సెప్టిక్ అయిందా!? డాక్టర్! ఎంత డబ్బు ఖర్చయినా పరవాలేదు మీరే ఏదో వుపాయం చెప్పండి – అన్నాడు శేషాద్రి ఆరి౦పుగా

మొదట్లోనే మందులు వాడి వుంటే ఏ ప్రమాదం వుండేది కాదు శేషాద్రిగారూ కానీ అశ్రద్ధ చేశారు స్టేజీ దాటి పోయిన తర్వాత మందులు వాడీ ప్రయోజనం వుండదు. అయినా మీ తృప్తి కోసం కొన్ని మందులు రాసిస్తాను. వాడండి మీరు మాత్రం రవికిరణ్‌ను హైదరాబాద్ తీసుకువెళ్ళండి ఎందుకంటే ప్రస్తుతం కాలి పాదం వరకే వున్న ప్రమాదం ఏమాత్రం ఉపేక్షించినా కాలు







## ప్రతిస్పందన

మొత్తానికే

అర్థమైంది డాక్టర్! ఇక ఏమాత్రం అశ్రద్ధ చేయం వెంటనే హైదరాబాద్ తీసుకువెళ్తాను బాబీని. మీ కెవరైనా తెలిసిన డాక్టరుంటే రికమండేషన్ లెటర్ వ్రాసి యివ్వండి - అడిగారు శేషాద్రిగారు ప్రాధేయపడుతూన్నట్లు

అలాగే అని తన మిత్రునికి వుత్తరం వ్రాసి శేషాద్రి గారికి యిచ్చారు డాక్టర్

'తను ప్రమాదం కొనితెచ్చుకున్నాడేమిటి?– డాక్టర్ మాటల ధోరణిని బట్టి చూస్తే - తన పాదం తీసి వేయవలసిందేనా? కాదంటే కాలు మొత్తమూ పోతుందా? ఎంత ఫూల్ తను' - రవికిరణ్‌కు కళ్ళనీళ్ళు ఆగలేదు

* * * *

రోజులు గడిచి పోతున్నయి

చేసిన తప్పుకు మూల్యం చెల్లించుకోవలసిన పరిస్థితి ఏర్పడక తప్పలేదు రవికిరణ్‌కు

తమ ఫ్యామిలీ డాక్టర్ యిచ్చిన సలహా ప్రకారం ఏ మాత్రం ఆలస్యం చేయకుండా తన కొడుకును హైదరాబాద్ తీసుకు వెళ్ళారు శేషాద్రిగారు యమునాదేవి సౌందర్య కూడా వెళ్ళారు

సాధ్యమైనంత వరకు ఇంజక్షన్‌లు మందులు ద్వారానే నయం చేయటానికి ప్రయత్నం చేశారు అక్కడి డాక్టర్లు పాదానికి మైనర్ ఆపరేషన్ చేసి చెడు రక్తం కూడా తీసేశారు

ఓ వారం రోజులు అలా గడిచింది రవికిరణ్ శరీరతత్వాన్ని బట్టి తిరిగి చీము పట్టింది.. ఆలస్యం చేస్తే కాలు మొత్తాన్నే తొలగించవలసి వస్తుందని - ఆపరేషన్ చేసి చీలమండ వరకు తొలగించేశారు.

'తన బాబీకి ఒక కాలికి పాదం లేదు వాడిప్పుడు మామూలుగా నడవలేడు' రవికిరణ్‌కు ఆపరేషన్ జరిగిన రోజు గుండె పోటు వచ్చింది శేషాద్రిగారికి యమునాదేవి, సౌందర్య - తట్టుకోలేని బాధను అనుభవించారు శేషాద్రిగారు రెండు రోజులు బెడ్ మీదే వుండిపోయారు రవికిరణ్ మరి కొంత కాలం పాటు హాస్పిటల్లోనే వుండి పోవాలని డాక్టర్లు చెప్పారు శేషాద్రిగారు శలవు పొడిగించారు యమునాదేవి కూడా కొడుకును గురించి అక్కడే వుండిపోవాలనుకుంది

సౌందర్య మాత్రం ఇంటికి వెళ్తానంది.. తమ వూళ్ళోనే వున్న పి జి. సెంటర్‌లో ఆమె ఎమ్ ఎ చేయాలనుకుంటోంది.. అందును గురించి ప్రయత్నాలు చెయ్యటం కోసమే - దయనీయస్థితిలో వున్న అన్నను వదిలి వెళ్ళటానికి సిద్ధపడింది

అంత పెద్ద యింట్లో ఒక్కదానివీ ఎలా వుంటావమ్మా? - సందేహపడ్డాడు శేషాద్రిగారు

సాకేత వుందిగా డాడీ! రాత్రిళ్ళు వాళ్ళ యింటికి వెళ్ళి పడుకుంటాను

తల్లిదండ్రులను వప్పించి తమ వూరికి వచ్చేసింది సౌందర్య

విషయం తెలిసి సాకేత ఎంతో బాధ పడింది

రవికిరణ్ ఎడమ కాలు పాదం తీసేశారంటే - అలా అని సౌందర్య చెప్పిన నిమిషంలో అప్రయత్నంగా కనుల వెంట నీళ్ళు తిరిగాయి సాకేతకు ఎందుకంటే అతణ్ణి కూడా ఓ మిత్రుడిగానే భావిస్తోంది ఆమె

* * * *

పోస్ట్‌గ్రాడ్యుయేషన్ సీటుకు సంబంధించి ఎంట్రెన్స్ పరీక్ష వ్రాసింది సౌందర్య

తనతో పాటు సాకేతను కూడా పి. జి కోర్సుకు అప్లయి చేయమంది సౌందర్య

ప్రస్తుత తమ కుటుంబ పరిస్థితులను బట్టి పై చదువులకు తాను ప్రయత్నం చేయనని చెప్పింది సాకేత ఎక్కడైనా మంచి వుద్యోగం చూసుకొని లైఫ్‌లో స్థిరపడటం... స్టాండ్ కావటం తన ముఖ్య వుద్దేశ్యమని - అభిప్రాయం వ్యక్తం చేసింది

ఓ ఆదివారం తమ ఆఫీస్ స్టాఫ్ అందరితో పాటు తానూ హైదరాబాద్ వెళ్ళి రవికిరణ్‌ను చూసి - శేషాద్రిగారికి సానుభూతి తెలిపి వచ్చాడు అనిరుద్ధ్

చంద్రిక యథాప్రకారంగా అనిరుద్ధ్ ఇంటికి వెళ్తూనే వుంది బావకు వంట చేసి పెట్టటంతో పాటు అతడికి సంబంధించిన మరో బాధ్యత కూడా తీసుకొంది చంద్రిక

ప్రస్తుతం అనిరుద్ధ్ వ్రాస్తున్న నవలను తాను ఫెయిర్ కాపీ చేసి పెడతానంది

చంద్రిక చేతి వ్రాత బాగుందనిపించటంతో సరే అన్నాడు అనిరుద్ధ్

అనిరుద్ధ్ వాళ్ళ యింటికి వెళ్తున్నందుకు పల్లెత్తు మాట కూడా అనటం లేదు సాకేత చంద్రికను మధ్య మధ్య సౌందర్యతో కలిసి తానూ వెళ్తూనే వుంది

చంద్రిక మంచితనం చొరవ చలాకీతనం - అన్నీ చూస్తుంటే కొత్త కొత్త భావాలు కలగటం మొదలైంది అనిరుద్ధ్‌లో

ఏ వ్యక్తయినా పేరు ప్రఖ్యాతుల్లోకి వచ్చాడంటే - ఆ వ్యక్తి వెనుక ఎవరో ఒక స్త్రీమూర్తి హస్తం వుంటుందట - ఎక్కడో చదివాడు అతడు అలాగే ఇప్పుడు చంద్రిక అహర్నిశలూ తనను గురించే తాపత్రయ పడటం చూస్తుంటే - ఆమె తన కోసమే పుట్టిందా అనిపిస్తోంది అనిరుద్ధ్‌కు

(ఇంకా ఉంది)

# రెండిళ్ళమధ్యదూరం

పూడిపెద్దిసత్యలక్ష్మి

రేపు ఆదివారం నాడు గోపాలం గారింటి కెళ్దామండీ- అంది మా శ్రీమతి కాఫీ కప్పు టేబిల్‌మీదపెడ్తూ

చూద్దాంలే అన్నాను కప్పు చేతిలోకి తీసుకుంటూ

చూద్దాంకాదు- వాళ్ళు మళ్ళీ వారం బయల్దేరి దశరా పండక్కి వాళ్ళ ఊరు వెళ్ళిపోతార్ట- తిరిగొచ్చేసరికి కనీసం నెలయినా పడుతుంది- అదీగాక మొన్న శారద టౌన్లో కొచ్చినప్పుడు మనింటికొచ్చి మరీ మరీ చెప్పింది- రమ్మని నేను వస్తానని ప్రామిస్ కూడా చేసాను- వాళ్ళు మనకోసం చూసి చూసి డిసప్పాయింటవుతారు

ఊఁ కాఫీ చప్పరిస్తూ ఊఁకొట్టాను

ఏవంటారు- వెళ్దామా! మళ్ళీ అడిగింది పట్టువదలని విక్రమార్కుడిలా

గోపాలం ఇంటికెళ్ళాలంటే అప్పట్లో రెండు సిటీ బస్సులు మారాల్సి వచ్చేది అందులోనూ- ఆదివారం రోజున బస్సులకి భయపడి మా ఆవిడ్ని నిరుత్సాహ పర్చటం ఇష్టంలేక- సరే అన్నాను

గోపాలం ఉంటున్నది గోపాలపట్నంలోనూ నేనుండేది సీతమ్మధారలోనూ కావటంచేత మా ఇద్దరిళ్ళ మధ్యన చెప్పుకో దగినంత దూరమే ఉంది ఇద్దరం ఒకే ఏరియాలో ఇల్లు తీసుకుందామను కుంటే చాలా కాలం నుండి సరైన ఇల్లు కుదర్లేదు

గోపాలాన్కి నాకూ మంచ స్నేహం మా పెళ్ళిళ్ళయ్యాక మా ఆవిడకీ- వాళ్ళావిడకీ కూడా మంచి స్నేహం కుదిరింది ఈ కారణంచేతనే మా మధ్య స్నేహం మరింత బలపడిందనే చెప్పుకోవాలి ఇద్దరం నగరం నడిబొడ్డులో ఉన్న ఓ ఆఫీసులోనే ఉద్యోగాలు వెలగబెడ్తున్నాం మేమిద్దరం రోజూ ఆఫీసులో కల్సుకుంటూనే ఉంటాం- కానీ ఆడవాళ్ళకోసం ఆదివారాల పూట వాళ్ళింటికి మేమూ లేక మా ఇంటికి వాళ్ళో రావటం జరుగుతోంది ఇంచుమించు మా రెండు కుటుంబాలూ కల్సుకోని ఆదివారం లేదనే చెప్పుకోవాలి

ఆ రోజు ఆఫీసులో గోపాలాన్ని కల్సినప్పుడు మర్నాడు వాళ్ళింటికి మేం వస్తున్నట్టు చెప్పాను

గోపాలం చాలా సంతోషించి తప్పకుండా రమ్మన్నాడు అనుకున్న ఆదివారం- అనుకోకుండా వచ్చేసింది ఆదివారమే కదా అని మంచం మీద పడుకుని బద్ధకంగా దొర్లుతున్నాను

గోపాలంగారింటికి వెళ్ళాలి - తొందరగా తెమలండి మళ్ళీ పొద్దెక్కితే బస్సులు దొరకవు అంటూ మా ఆవిడ చేసిన హెచ్చరికతో ఇంక లేవక తప్పలేదు

గబగబా కాలకృత్యాలు తీర్చుకుని, బ్రేక్‌ఫాస్ట్ కానిచ్చి - కాస్త వేడి, వేడి కాఫీ గొంతులో పోసుకుని, డ్రెస్ చేసుకుని - తలుపులు తాళాలు వేసుకుని - పక్కవాటా వాళ్ళకి చెప్పేసి - రోడ్డుమీద పడ్డాం.

అప్పట్నుండీ మొదలయ్యాయి మాపాట్లు. ఎంత సేపట్నుండీ వెయిట్ చేస్తున్నా బస్ రాలేదు. పొద్దుటిపూట ఎండకూడా తీక్షణంగా కాస్తోంది ఎండ మూలంగా వళ్ళంతా చెమట్లుపట్టేసి, మొహాలు జిడ్డు, జిడ్డుగా తయారయ్యాయి. నిలబడి నిలబడి, కాళ్ళు నొప్పులు పుట్టాయి - ఆఖరికెలాగయితేనేం బస్సొచ్చింది - అదెక్కి కష్టపడి సీట్లు సంపాదించుకొని, కూర్చుని హాయిగా నిట్టూర్చేం.

కాస్సేపటికి మేం మరో బస్సుకి మారాల్సిన స్టాపు వచ్చేసింది నిలబడ్డ జనాల్ని తప్పించుకొని - అవస్థపడుతూ ఇద్దరం దిగిపోయాం

ఇంక తర్వాత బస్సుకోసం నిరీక్షణ ప్రారంభించాం బస్టాపు పాసింజర్లతో కిక్కిరిసిపోతోంది మళ్ళీ అవకాశం దొరకదన్నట్లు ముష్టివాళ్ళు పోటీపడి మరీ అడుక్కుంటున్నారు శరీరం పూర్తిగా చెమటతో తడిసిపోయింది ఓ పక్క దాహం వేసేస్తోందిద్దరికీ - చుట్టుపక్క లెక్కడా హోటల్స్ కూడా లేవు ఇంక డబ్బులు కోసం చూసుకో కూడదనుకుని - ప్రక్క పాన్ దుఖానంలో రెండు కూల్‌డ్రింక్‌లు తీసుకున్నాం

అయ్ బాబోయ్ - బస్సొచ్చేసింది - తొందరగా తాగని మా ఆవిడ్ని తొందరపెట్టి - రెండుగుక్కల్లో నేను కూడా తాగేసి ఖాళీ బాటిల్స్ - ఇరవైరూపాయల నోటు అందించాను షాప్‌వాడికి - వాడు కాగితాన్ని పుచ్చుకోకుండానే చిల్లర్లేదన్నాడు

ఎనిష్ - బస్సెళ్ళిపోయింది మరో గంటో గంటన్నరసేపో ఈస్టాపులో భజన తపస్సు చెయ్యక తప్పదు.



ఇరవై కాగితమని డ్రింక్ తీసుకునే ముందెందుకు చెప్పలేదని షాపువాడి దబాయింపు వందలకు వందలమ్మే షాపులో నాల్గురూపాయల బేరాన్కి ఇరవై రూపాయల చిల్లర లేకపోవట మేమిటని నా వాదింపు (బస్సెళ్ళిపోయింది – మరి కాలక్షేపం ఎలా) ఆఖర్కి మరో రెండు బేరాల్చూసుకుని గొణుక్కుంటూ చిల్లరిచ్చాడు షాపువాడు ఈ లోపున రెండు బస్సులొచ్చాయి గాని అవి అక్కడ ఆగలేదు మరొగంటసేపు ఓపిక పట్టి – విసుగెత్తిపోయి – కోపం వచ్చేసింది తిరిగింటి కెళ్ళిపోదామా – అని కూడా అన్పించకపోలేదు ఈలోగా బస్సొచ్చింది కాని ఖాళీలేదు కిక్కిరిసిపోయిన పేసింజర్లతో ఆ స్టాప్‌లో ఆగి – మాతోపాటు మరో పదిమంది నెక్కించుకుని మరీ నిండు చూలాల్లా కదిలింది – ఆ బస్సు చూడగానే పురాణాల్లో పుష్పక విమానం గుర్తొచ్చింది నాకు భారతంలో అభిమన్యు కుమారుడ్లా బస్సులో టిక్కెట్టు కలెక్ట్ చెయ్యరా చిట్టికన్నా అని అందులో పడేస్తే టిక్కెట్ల సంగతలా ఉంచి – కాలో చెయ్యో విరుచుకోవటం ఖాయం అలా ఉందా బస్సుమరి కండక్టరుగారి పరిస్థితి మరీ ఘోరం ఓ చేతిలో డబ్బుతీసుకుని – మరో చేతిలో టిక్కెట్టుపెట్టి చీవాట్లు తింటున్నాడు మా ఆవిడ సంగతేమోగాని – నా మట్టుకు నాకు చాలా ఇబ్బందిగా ఉంది– బస్సెక్కడాగుతోందో అస్సలు తెలీటం లేదు ఎంత దూరం వచ్చామో అంతకంటే తెలీటం లేదు

బస్సుల వాళ్ళమీద– ప్రయాణీకులమీద నా మీద మా ఆవిడ మీద కిళ్ళీకొట్లు వాళ్ళ మీద– ఎక్కడో పట్నానికి చివర్న కొంప తీసుకుని కాపురం ఉన్న గోపాలంమీద– మా స్నేహం మీద వారానికోసారి మా పాలిట శనిలా దాపురించే ఈ ఆదివారాల మీద గొప్పకోపం వచ్చింది మనస్సులోనే అందర్నీ కామన్‌గా అచ్చ తెనుగులో తిట్టుకోడం మొదలెట్టాను బస్సులకే తప్ప– ఆటో టాక్సీలకి బడ్జెట్‌లేని మా మధ్యతరగతి జీవితాల మీద కూడా కోపం వచ్చింది ఏం చెయ్యటం– దాన్నీ తిట్టుకున్నాను (మనసులోనే సుమండీ) వెళ్ళగా వెళ్ళగా కాసేపటికి గోపాలపట్నం స్టాపొచ్చింది ఎలాగోలా కష్టపడి దారి చేసుకుని– నేను దిగిపోయి మా ఆవిడ్ని కూడా కేకేసి దించి– హమ్మయ్య అనుకుని– చెదిరిపోయిన జుట్టు దువ్వెనతో సరిచేసుకుని– చెమటతో జిడ్డు పట్టిన ముఖాన్ని తుడుచుకుందాం కదాని రుమాలుకోసం జేబులో చెయ్యి పెట్టాను అంతే మనసుకి షాక్ తగిలింది– జేబులో పర్స్– అన్ని జేబులూ వెతికాను– మా ఆవిడ హేండ్‌బేగ్ కూడా వెతికేను– లేదు పోయింది మూడు ఏభైలు– రెండు ఇరవైలు కల్పి పొందిగ్గా ఇమిడిన పర్స్ బస్సులో పోయింది– ఇందాక పాన్ దుకాణంలో ఇరవై నోటు నుండి వచ్చిన చిల్లర పై జేబులో ఉండబట్టిగాని లేకపోతే నిలువుదోపిడీ కిందే లెఖ్ఖ–

విశాఖపట్నంలో– అందులోనూ– సిటీబస్సులో అంత రష్షులో పర్స్ పోయిందంటే పెద్దగా–




# రెండిళ్ళ మధ్య దూరం

ఆశ్చర్యపోనక్కర్లేదు– ఆ రష్‌లో షర్టుని– షర్ట్‌లా ఉంచి– బనీన్నిప్పుకు పోయే చోర ఘనాపాటీ లున్నారు

పర్సు పోయిందన్న విచారంకన్నా నాకు ఎలాగోలా గోపాలపట్నం చేరామనే సంతోషమే ఎక్కువగా ఉంది– మూడు వీధులూ– రెండు సందులూ దాటి మొత్తాని కెలాగైతేనేమి– గోపాలంగాడింటికి చేరుకున్నాం

మా కోసం వాళ్ళు ఒంటిగంట వరకూ చూసి– ఇంక మేం రామనుకొని భోజనాలు చేసే ప్రయత్నాల్లో ఉండగా వెళ్ళిన మమ్మల్ని చూసి– చాలా సంతోషించారా దంపతులు మర్యాదలూ– పలకరింపులూ అన్ని అయ్యాక భోజనము చేసి– నేను గోపాలం మాటల్లో పడ్డాం– సిగరెట్లు కాల్చుకుంటూ– వంటింట్లో మా ఆవిడా వాళ్ళావిడా కూడా మాటల్లో పడ్డారు

వాల్తేరు స్టేషన్లో ట్రయినెక్కి– హౌరా స్టేషన్ చేరుకున్నంత గొప్పగా మా బస్సు ప్రయాణాల విశేషాలు చెప్పేస్తోంది మా ఆవిడ ఆఫీసులో ప్యూన్ నుండి– ఆఫీసరు వరకూ– వారి మనస్తత్వాల మీద చర్చించేసుకుంటున్నాం మేమిద్దరమూను–

అలా– అలా– నాలుగ్గంటలయి పోవటం– కాఫీలు– సాయంత్రం పూట టిఫిన్స్ పూర్తి చేసుకుని– ఆ రాత్రికి ఉండిపొమ్మని వాళ్ళెంత బలవంతం చేస్తున్నా వినకుండా వాళ్ళ దగ్గర శలవు పుచ్చుకుని– పొద్దుట ఇంటి నుండి అక్కడికి చేరటాన్కి పడ్డంత శ్రమా మళ్ళీ పడి రాత్రి 9 గంటలకి కొంప అనబడే మా గూటికి చేరుకున్నాం

★ ★ ★

గోపాలం ఆఫీసుకో నెలరోజులు శలవుపెట్టి దశరా పండక్కి వాళ్ళావిడ్ని తీసుకుని వాళ్ళూరు వెళ్ళిపోయాడు మరో వారం రోజులు పోయాక మా మరదలికి పెళ్ళి కుదిరిందని– ముహూర్తాలు కూడా పెట్టేరని– 20 రోజుల వ్యవధిలో ఫలానా రోజున పెళ్ళని కాబట్టి వెంటనే మా ఆవిడ్ని– శలవు వ్యవహారాలు చూసుకుని 10 రోజులు కనీస వ్యవధిలో నన్నూ రమ్మని– మా మావగార్నుండి ఉత్తరం వచ్చింది ఈ సంగతి తెల్సుకుని మా ఆవిడ ఎగిరి గంతేసి బట్టలు సర్దుకోటం ప్రారంభించి– మర్నాటి ఉదయం బస్సుకి రడీ అయి కూర్చుంది ఆవిడ్ని బస్సెక్కించి– జాగ్రత్తగా వెళ్ళమని– వీలు చూసుకుని పెళ్ళికి నాలుగైదు రోజులు ముందుగా నేను వస్తానని చెప్పి పంపించాను

మా ఆవిడ వెళ్ళిన నాల్రోజుల తర్వాత ఏదో పని మీద గోపాలపట్నం వెళ్ళాను అక్కడ గోపాలం ఉండే ఇవతలి వీదిలో ఓ ఇల్లు ఖాళీగా ఉందని – తెల్సి– అక్కడికెళ్ళి ఇల్లు చూసి– అద్దె వగైరాలు మాట్లాడుకుని– ఓ నెల రోజుల అద్దె ముందుగానే అడ్వాన్సు కూడా ఇచ్చేసి– ఓ ఆదివారంపూట నేనొక్కడ్నీ రెండు ట్రిప్పులకి ఆటో మాట్లాడి ఇల్లు షిఫ్ట్ చేసేసాను అప్పటి కింకా గోపాలం రాలేదు– వాడూ వాళ్ళావిడ– మా ఆవిడ నేన్చేసిన ఈ పనికి ఎంత సంతోషిస్తారో ఊహించుకుంటూ గడపసాగాను

ఈలోగా మా మరదలి పెళ్ళి దగ్గర పడింది ఆఫీసుకో వారం రోజులు శలవు పెట్టి పెళ్ళికి వెళ్ళాను పెళ్ళి అయిపోయింది– నేను ఇల్లు మార్చిన సంగతి విని మా ఆవిడ చాలా సంతోషించింది ఇంక ప్రతీ రోజూ– మా కుటుంబాలు రెండు కల్సుకోవచ్చని తెగ మురిసిపోయిందామె

నాకు సెలవులేదు– బయల్దేరమని ఆవిడకి చెప్పాను– కానీ మా మావగారు– అత్తగారు ఇతర బంధు మిత్రుల బలవంతం మీద మా ఆవిడ మరో వారం రోజులక్కడే ఉండటాన్కి అనుమతివ్వక తప్పలేదు నాకు ఏ రోజున ఏ బస్సులో రావాలో మా ఆవిడకి వివరంగా చెప్పి– నేనా రోజు ప్రొద్దుట బస్సులో బయల్దేరి విశాఖపట్నం చేరుకున్నాను– రావటం– రావటంతోనే బస్టాండ్ నుండి సరాసరి ఆఫీసుకెళ్ళి పోయాను ఆఫీసులో గోపాలం రెండ్రోజుల క్రితమే వచ్చి జాయినయ్యాడని తెల్సుకుని నేను ఇల్లు మార్చిన సంగతి గోపాలం గాడికి చెప్దామని వాడిసీటు దగ్గ కెళ్ళాను– కుశల ప్రశ్నలువేసుకుని– కాంటిన్ నుండి టీలు తెప్పించుకుని తాగుతూ– నేను గోపాలపట్నంకి– ఇల్లు మార్చిన సంగతి చెప్పేను– గోపాలం ముఖంలో రాబోయే సంతోషఛాయలు చూద్దామని ప్రయత్నిస్తూ వాడిలో నేనూహించిన మార్పు రాలేదు సరిగదా మొహం వికసించనైనాలేదు పైగా వాడు చెప్పిన సంగతి తెలిసి నా మొహం కూడా మారిపోయింది వాడు చెప్పిన విషయం ఇది

నేనూ నీలాగే ఆలోచించి–శలవునుండి వస్తూనే సీతమ్మధారలో మీ ఇంటి దగ్గర్లో ఉన్న ఇంటికి షిఫ్ట్ చేసేశాన్రా మీ ఇంటి కెళ్ళి చూస్తే ఇల్లు తాళం– మీ మరదలికి పెళ్ళని– నువ్వు శలవు పెట్టేవని ఆఫీసులో తెల్సింది నేనే నిన్ను సర్‌ప్రైజి చేద్దామనుకుంటూన్నానింకా– అన్నాడు మా ఆవిడకీ విషయం తెల్సి మరీ బాధపడిందనుకోండి– అదివేరే విషయం– ఇప్పుడు కూడా మా రెండిళ్ళమధ్య దూరంలో మార్పు ఏం లేదు □



# దూరదర్శనం

లత

## బుచ్చిబాబు

సీరియల్ నాటిక ఈ బుచ్చిబాబు చివరకి విసుగెత్తిస్తోంది కథ నడపటం లేదు అదలా ఉంచి చివరలో జంద్యాల గాడిద కూడా నో అనేటటువంటి నవలలు అలివేలు చదువుతోందని చిన్ని కామెంటు విసరాడు కొన్ని నవలలు అలా ఉండచ్చును ఉన్నాయి కూడా కాని అలాటి నవలల్నే ఒకటి రెండు సినిమాలుగా తీస జంధ్యాల దెబ్బతిని ఉండాలి కాని జనరలైజ్ చేసే మహోన్నత రచయితల్నీ గాడిద కూడా నో అనే నవలల్ని వ్రాసిన రచయితల్నీ – ఒక గాట కట్టడం మంచిది కాదేమో? భవిష్యత్తులో జంద్యాల మంచి నవలలో మంచి సినిమాలు తీస్తాడని ఆశిస్తున్నాను బుచ్చిబాబు ఇక సాగదీస్తే బాగుండదు

వరాహలక్ష్మీ నృసింహస్వామి వారి ఉత్సవాలు చూపించారు కొన్ని ఏళ్ళ కిందట సింహాచలస్వామికి కృష్ణదేవరాయలు సమర్పించిన అతివిలువైన నగలు పోయినయ్యని పత్రికలు గగ్గోలు పెట్టినయ్ ఆ నగల ఆచూకీ తెలిసిందా? లేదా పోలీసులూ పత్రికలూ ప్రజలూ గూఢచారులూ మర్చిపోయారా? సహజంగా ఎవరి వాటా వాళ్ళు తీసుకుని ఊరుకోటమే జరుగుతుందనుకోండి వార్తాదర్శిని చూస్తుంటే జ్ఞాపకం వచ్చింది – యాదగిరి నృసింహస్వామి ఉత్సవాలు చూపించారు మా మంగళగిరి దొరనీ చూపిస్తే సంతోషించే వాళ్ళం దేముడొకడే అయినా ప్రదేశాలు వేరు గదా! అందుకు

## స్వయం సిద్ధ

రచన విజయ తెందూల్కర్ ముఖ్యపాత్రధారిణి ఆయన కూతురు ప్రియాతెందూల్కర్ రజనీఫేమ్ – ప్రతి మగవాడూ ఆమెని అదే దృష్టితో చూస్తారు బయపడుతుంది ఆఫీసుల్లో ఆఫీసరు లంచ్ టైమ్‌లో తోటి ఉద్యోగి రోడ్డు మీద నడిచే ప్రతివాళ్ళూ ఆమెని ఆ దృష్టితోనే చూస్తారు కనక కత్తి తలకింద పెట్టుకుపడుకుంది స్వయం సిద్ధ మహాపట్నాల్లో ఆడవాళ్ళు డైవోర్సీలో వెదవ ముండలో కన్యలో పట్టించుకోరు విజయవాడలోనే పట్టించుకోరు బొంబాయిలోనా? అద్దంలో చూస్తే వార్ధక్య బయం టైటి కొస్తే మగపురుగుల బయం అసలు విడాకులెందు కిచ్చిందో ఆ కారణం బలంగా లేదు అసలు కారణం లేదు విజయతెందూల్కర్‌లో రచనా పాటవం తగ్గి – తన రచనకు చక్కని నటి కూతుర్ని చచ్చుగా తయారు చేస్తున్నాడు ఈ నాటికకి స్వయం సిద్ధ అనే కన్నా ఎరికిపంద అంటే బాగుంటుంది!

## ఇంద్రధనుస్సు

పాపం వెంకట్రావ్ రచన యర్రంశెట్టి శాయి – టైటిలుకీ కథకీ డైలాగులకీ నటనకీ ఏ విధమైన సంబంధం లేదు తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం ఒకటో రకం చెత్త నాటిక ఒక బావామరదలు పెళ్ళి చేసుకోవాలనుకుంటారు వంటవాడి సలహాతో ఫిట్సు వచ్చి పడిపోయినట్లు నటిస్తుంది పెళ్ళి అయిన తరువాత – వాళ్ళిద్దరి పెళ్ళి అయితే ఆవిడకి వంటరాదు కనక వాడి ఉద్యోగం ఉంటుందట – ఇందులో ఒక అంతరాత్మ ప్రత్యక్షమయి ఫిట్సున్న దాన్ని పెళ్ళి చేసుకోవద్దని చెప్పటం యర్రంశెట్టి శాయి హాస్యం అనే భ్రమతో అపహాస్యం చేశాడు ఈ నాటిక వస్తున్నంత సేపూ ఫల్కు పైకీ కిందకీ ఊగుతూనే ఉంది

## ఏక్ కహానీ

మోతీకీ సాయిమే నేపాలీ కథ రచయిత పరశురామ్ మోకా – ఈ కథకి అర్థం మృత్యువు కోరల్లో అనుకుంటాను వకీల్ వీరేంద్రసింగ్ ఆఫీసు నుంచి ఇంటి కెడుతుండగా ఒక యువకుడొచ్చి మృత్యువు ఎన్ని రకాలుగా రావటానికి వీలుందో చెప్పి ఆయన బి పి పెంచుతాడు లాయరు గారికి మంచినీళ్ళిచ్చి కరెంటు పోగా భయపెట్టి ఏ క్షణంలో ఆయన చస్తాడో అన్న టింపో మనకి కలిగించాడు – తీరా అతను ఇన్సూరెన్స్ ఎజంట్ కథ నడపటం బాగుంది

## పునాది రాళ్ళు

సర్పంచుల అన్యాయాల మీద తీసిన బడ్జెట్ చిత్రం – ఇప్పుడు మండలాధిపతుల మీద తీయాలేమో? అయినా సాహిత్యంలోనూ సినిమాల్లోనూ సర్పంచులు చాలా దొంగ ముండాకొడుకులుగా చూపిస్తారు నిజం ఏమిటో గాని

ఎమ్ ఎన్ రాయ్ గురించి శ్రీ ఆవుల సాంబ శివరావు గారి ప్రసంగం చాలా చక్కగా ఉంది రాయ్ మానవతావాద భక్తులైన నాబోటి వాళ్ళకి ఈ ప్రసంగం ఎంతో హృద్యంగా ఉంది

ఆదివారం క్రికెట్ మధ్యలో ఏవో రెండు నాటికలు స్పైడర్‌మాన్ లాటివి చూపించారు గాని చెప్పుకోదగ్గవి కావు

## ముక్తి

ఇద్దరు మగవాళ్ళు ఒక స్త్రీ వారి మధ్య ప్రేమ ట్రయాంగిల్ ప్రేమ చివరికి ఒకడు చచ్చి త్యాగం చేయటం అతని సమాధికి మిగిలిన ఒకడూ ఒకతే ఎల్లా మూడు పూటలా పూలు చల్లడం ఇదీ కథ అయినా తీయటం బాగుంది

## మాటర్స్ రిమెంబర్

భగత్‌సింగ్ – నాన్‌కో ఆపరేషన్ మూమెంట్ నుంచి భగత్‌సింగ్ గురించి చాలా చక్కగా చూపించారు ఏరితల్లి నిరుడు బ్రతికిన వీరులందరు? ఏరి తల్లీ – లెనిన్ మార్క్సులతో మన భగత్‌సింగ్ లాటి వీరుల్ని పోలుస్తున్నారు అలాగే ఎమ్ ఎన్. రాయ్ లెనిన్ సమానంగా తమ దేశాలకి భక్తులయిన మహనీయులు అయినా ఇంత మంది భారతీయ మహావీరు లుండగా విజయవాడలో లెనిన్ విగ్రహం వేస్తున్నా రెంచేత? చిత్రం భగత్‌సింగ్ సమాధి అన్న చోట పక్షులు గానం చేస్తున్నాయి నిజంగా పక్షులే టి వి వాళ్ళ సైడ్ ఎఫెక్ట్సు కాదు

ఎలక్షన్ల వివరాలూ మిగతా కార్యక్రమాలూ అలా ఉంచి శ్రీహరికోటలో ప్రయోగించిన రాకెట్ – కోట్లాది జనం చూస్తూ ఉండగానే సముద్రంలో కూలి పోయింది □

"ఏక్ కహానీ"లో ఒక దృశ్యం



# హైదరాబాద్ నోట్‌బుక్

## డాక్టర్ నళినీ మోహన్‌కు ఇందిరాగాంధీ అవార్డు -

బారతీయ బాషలలో విజ్ఞాన విషయ వ్యాప్తికి శాస్త్రీయ దృక్పథ ప్రచారానికిగాను ఇండియన్ నేషనల్ సైన్స్ అకాడెమి ఇందిరాగాంధీ పేరిట ఏర్పాటు చేసన బహుమానం ప్రప్రథమంగా డాక్టర్ మహీధర నళినీ మోహనరావును వరించింది ఈ బహుమానం 1986లో ఏర్పాటు చేశారు ఈ సంవత్సరానికి డాక్టర్ నళినీ మోహన్‌రావును బహుమానార్హునిగా ఎన్నిక చేశారు ఇండియన్ నేషనల్ సైన్స్ అకాడెమి వారు నేషనల్ జియోఫిజికల్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ వారూ సంయుక్తంగా మార్చి 14 వ తేదీన ఆర్ ఆర్ లేబరేటరీస్ సమావేశ మందిరంలో జరిగిన సమావేశంలో ఈ అవార్డును డాక్టర్ నళినీ మోహన్‌కు అందజేశారు ఈ సమావేశానికి హైదరాబాద్ సార్వత్రిక విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టర్ సి నారాయణరెడ్డి అధ్యక్షత వహించారు డాక్టర్ నళినీ మోహన్ సారస్వత వైజ్ఞానిక మేధా విలసతాన్ని అయన మెచ్చుకొంటూ పదివేల రూపాయల నిధిని అందజేశారు శ్రీయుతులు న్యూస్ టైమ్ సంపాదకులు శ్రీ వాకాటి పాండు రంగారావు బాలల అకాడెమి కార్యదర్శి శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ తెలుగు అకాడెమి రీసెర్చ్ అఫీసర్ డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు డాక్టర్ నళినీమోహన్‌రావు శాస్త్రీయ విజ్ఞాన కృషిని బాల సాహిత్య సేవను సాహిత్య కృషిని ప్రశంసించారు డాక్టర్ నళినీ మోహన్ సౌరశక్తి వినియోగం గురించి వివరణాత్మకమైన ప్రసంగం చేశారు మార్చి 19వ తేదీన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో డాక్టర్ మహీధర నళినీ మోహన్ అభినందన సభ జరిగింది శ్రీపోతుకూచి సాంబశివ రావు అధ్యక్షత వహించారు డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు డాక్టర్ నళినీమోహన్ విజ్ఞాన సాహిత్య వైదుష్యాన్ని గురించి విపులంగా ప్రసంగించారు శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం కార్యదర్శి శ్రీ ఎం వి ఎల్ నరసింహారావు డాక్టర్ నళినీ మోహన్‌ను భాషా నిలయం పక్షాన శాలువతో సత్కరించారు డాక్టర్ నళినీ మోహన్ తోక చుక్కల పుట్టు పూర్వాలను గురించి స్వరూప స్వభావాలను గురించి వివరణాత్మకమైన ప్రసంగం చేశారు ఈ రెండు సభలలోను అయన ప్రసంగాలను మెచ్చుకుంటూ పలువురు మిత్రులు అయనను అభినందించారు అన్నిటికన్నా ముఖ్యమైన విషయం ఇందిరాగాంధి పేరిట నెలకొల్పిన విజ్ఞాన శాస్త్ర పురస్కారం నెలకొన్న వెంటనే ప్రప్రథమంగా తెలుగు వారికి రావడం ప్రాంతీయ భాషలలో విజ్ఞాన శాస్త్ర ప్రచారంలోను అంధ్ర ప్రదేశ్ అగ్రగామిగా వుందనడం (డాక్టర్ నళినీ మోహన్‌ను హైదరాబాద్ నోట్‌బుక్ ఇది వరకే పరిచయం చేసింది)




అంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల శాఖ ఆద్వర్యంలో మార్చి 25న రవీంద్ర బారతిలో ఇంద్రజాల ప్రదర్శన చేస్తున్న శ్రీ బి వి ఎస్ నగేష్

## శ్రీ నగేశ్ ఇంద్రజాల ప్రదర్శనం -

రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక శాఖ అధ్వర్యాన మార్చి 25న రవీంద్రభారతిలో శ్రీ బి వి ఎస్ నగేశ్ ఇంద్రజాల ప్రదర్శన చేసి ప్రేక్షకులను అనందపరి చారు శ్రీ నగేష్ సుప్రసిద్ధ ఇంద్రజాలికులు జాదూ రత్న శ్రీ బి వి పట్టాభిరాం శిష్యులు ఇంత వరకు రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో 400 ప్రదర్శన లిచ్చారు ఇంద్రజాలమనేది ఏదో మంత్ర తంత్రాలు కాదని కేవలం కనుకట్టని గ్రామీణులలో వున్న అపోహలను తొలగించి హేతువాదాన్ని అలవర్చడమే తమ ఉద్దేశమని ఈ ప్రదర్శనం ఏర్పాటు చేసిన అంధ్రప్రదేశ్ మాజిక్ అకాడెమి అధ్యక్షులు శ్రీ బి వి పట్టాభిరాం అన్నారు తాము నిర్వహిస్తున్న బాలానందం ఇంద్రజాల పాఠశాల ప్రపంచంలోనే అలాటి తొలి ఇంద్రజాల పాఠశాలగా గిన్నీస్‌బుక్‌లో ఎక్కబోతున్నదని అయన అనగా ప్రేక్షకులు హర్ష నినాదాలు చేశారు శ్రీ నగేష్ స్టేట్ బ్యాంక్ అఫ ఇండియాలో పని చేస్తున్నారని ఇంద్రజాలం అయన వినోదం కోసం నేర్చుకొన్నారని కూడ శ్రీ పట్టాభిరాం వివరించారు శ్రీ నగేష్ చేసిన వాటిలో సీసాలో రంగు జేబురుమాలు తెప్పించడం పేక ముక్కలు చెల్లా చెదరుగా వేసి గుడ్డ కప్పి మేడగా తీయడం కళ్లకు గంతలు కట్టుకొని ప్రేక్షకులు వ్రాసింది చదవడం లేక వారి ప్రశ్నలకు తగిన సమాధానాలివ్వడం మున్నగునవి ప్రేక్షకులను అశ్చర్యచకితులను చేసింది ప్రారంభంలో శ్రీ నేరెళ్ల వేణు మాధవ్ శిష్యుడు శ్రీ పరమేశ్వర్ ధ్వన్యనుకరణ ప్రదర్శనం చేశారు పిదప శ్రీ చౌహాన్ అరగంట సేపు సారంగ్ వాద్యం వాయించి శ్రోతలను అనంద పరిచారు

## ఉపశ్రుతి -

ఏం సార్! మీ పార్టీ మొన్నటి ఎన్నికలలో పూర్తిగా దెబ్బ తిన్నదే? అనడిగాను ఒక నాయకుణ్ని స్వామీ! మేము భారతీయ సంస్కృతిలో సంపూర్ణ విశ్వాసం వున్న వాళ్లం పోరాడడం మా పని జయాపజయాలు పైవాని పని అన్నారు అయన కృష్ణునిలాగ ఉపదేశముద్రతో

-తిరుమల రామచంద్ర

# తారలకు యింపు సొంపుల నిచ్చేది
# యిప్పుడు మరింత ప్రియమైనది




# ఇమామి

టాల్క్ పౌడర్ మరియు వ్యానిషింగ్ క్రీమ్

**యిప్పుడు మునపటికన్నా ఎంతో ఆకర్షణీయమైన ప్యాక్‌లో**

# అమెరికాలో విచిత్ర క్రీడా పోటీలు

అమెరికా అంటే యు ఎస్ ఏ ప్రపంచ క్రీడారంగములో ప్రథమ స్థానము పొందుటకు దృఢ సంకల్పముతో కృషి చేయుటయే గాక క్రీడలను ప్రచార సాధనముగా కూడా ఉపయోగించు కొంటున్నది అనే అభిప్రాయము ఉన్నది అంతర్జాతీయ క్రీడారంగము ఒలింపిక్ క్రీడలలో మొదటి స్థానము సాధించు ప్రయత్నంతో పాటు స్థానికముగా స్వదేశములో విచిత్ర క్రీడా పోటీలు జరుపుటలో ఖ్యాతి పొందినది

## ఊర్ధ్వ – మరదాన్

ఇది ప్రపంచంలో న్యూయార్కు నగరములో గల 8 "ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ లో మాత్రము జరుగును అందుకు కారణము యీ పెద్ద భవనము 86 అంతస్తులు కలిగి యుండుట ఇంత ఎత్తు భవనము ప్రపంచంలో ఎక్కడా లేదు ఈ పోటీ గత రెండు దశాబ్దములుగా జరుగు చున్నది విచిత్ర పరిస్థితులలో ప్రారంభించ బడినది

1964 టోక్యో ఒలింపిక్ క్రీడలకు ముందు ప్రముఖ అమెరికన్ హైజంపర్ జాన్ థామస్ తన మిత్రులతో పింత పందెము కాసాడు తాను టోక్యో ఒలింపిక్స్‌లో బంగారు పతకము సాధించలేక పోయిన అప్పటి హైజంప్ మేటి ఎథిలెట్ వాలరీ బ్రమ్మెల్‌ను ఓడించలేక పోయిన ఎంపైర్ స్టేట్ బిల్డింగ్స్ పైవరకు ఆగకుండా పరుగుగా ఎక్కుతాను అని పందెము కాసాడు జాన్ థామస్ వాలరీ బ్రమ్మెల్‌ను టోక్యో ఒలింపిక్స్‌లో ఓడించలేక పోయాడు కాని పందెము సంగతి మంచి ప్రచారము పొందినది న్యూయార్క్ రన్నింగ్ క్లబ్ ఊర్ధ్వ- మరథాన్ పోటీ ప్రారంభించి ఏటా జరుపు చున్నది 86 అంతస్తులు కలిగిన ఆకాశ సౌధము క్రింద నుండి పోటీ ప్రారంభము అయి ఆఖరి (పై) అంతస్తులో ముగియును ఆ భవన "లిఫ్టు"లో ప్రయాణించుట అనుమతించరు మెట్లపై నిలువునా పరుగెత్తి ఆఖరి అంతస్తు చేరాలి అనేక మంది ప్రతి సంవత్సరము యీ పోటీలో పాల్గొంటారు

ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ పైకి మారథాన్ పరుగు



పెటిస్క్వేర్స్ అందరికన్న వేగముగా పరుగెత్తి రికార్డు నెలకొల్పాడు 86 అంతస్తులు మెట్లు మీదుగా పరుగెత్తుటకు పెటీ స్క్వేర్స్‌నకు పది నిషాల యాభై తొమ్మిదిసెకండ్లు పట్టినది స్క్వేర్స్ తన అనుభవము గురించి చెప్పుచు 86 అంతస్తుల మెట్లపై మెల్లగా వెళ్ళుటయే కష్టము మరి వేగముగా నిలువుగా పరుగెత్తుట ఎంతో కష్టము కాళ్ళ నొప్పుల బాధ సహితము లెక్కించకుండా నిరంతర కృషి కావాలి పైకి వెళ్ళు కొద్ది కాళ్ళు ఊపిరితిత్తులు సరిగా పని చేయవు కాళ్ళ నొప్పులు అలసట వచ్చును అంతేగాక యీ మెట్లదారిలో సరియైన గాలి యుండదు విశ్రమించుటకు అనుమతించరు ఆగకుండా పైకి పరుగెత్తాలి

నినాకుష్‌బిల్ అనే మహిళ 14 నిమిషాల 39 సెకండ్లలో నిలువుగా పరుగెత్తి రికార్డు నెలకొల్పినది ఈ పోటీలు నిర్వహించు న్యూయార్క్ రన్నింగ్ క్లబ్ విజేతలకు మంచి బహుమతి పోటీలో పైవరకు పరుగెత్తిన అందరికి పతకములు యిచ్చి గౌరవించును

## 'కార్ల ఫుట్‌బాల్

ఈ ఫుట్‌బాల్ మ్యాచ్‌లో ఒక్కొక్క జట్టులో ఆరు (6) పెద్ద కార్లు యుండును బంతిగా అతి చిన్నకారు యుండును పెద్ద కార్లు చిన్నకారు (బంతి)ను గుద్ది దొర్లించి ఎదుటి జట్టు గోలులోనికి పంపాలి



కారుల ఫుట్‌బాల్

ఈ ఆటను అమెరికాలో డిమాలిషన్ డెర్బీస్" అంటారు మరొక కార్ల ఆటలో 200 వరకు పాత కార్లు పాల్గొనును కారులు అతివేగముగా వెళ్ళుచు ప్రక్కటాటిని గుద్ది ప్రక్కకు త్రోసి వేస ముందుకు వెళ్ళును కారులకు ఎట్టి రక్షణ గార్డులు ఏర్పాటుకు అనుమతించరు పోటీలో పాల్గొను ప్రతి కారు 30 సెకండ్లకు ఒకసారిఅయిన కనీసము మరొక కారును ఢీ కొనాలి లేనిచో పోటీ నుంచి తొలగించ బడును ఎట్టి నష్టమూపొందక ముందుగా వచ్చిన కారు డ్రైవరు విజేతగా ప్రకటించ బడును మిగిలిన ఓటమి పొందిన కారులు అన్నిటిని పెద్ద బుల్‌డోజర్ పాత యినప సామానుగా నొక్కి ప్రక్కగా త్రోసివేయును

## అమెరికన్ క్రీడాకారుల అలవాటులు, మూడ నమ్మకాలు

ఇతరులకన్న అమెరికన్‌లకి మూడ నమ్మకాలు ఎక్కువ మనలో చాలా మంది దీనిని నమ్మరు అమెరికన్ క్రీడాకారులు పోటీ సమయములో ముఖ్యముగా ఆచరిస్తారు

టెన్నిసు ఆటగాళ్ళు పోటీలకు ముందు తల క్షౌరము గడ్డము గీయించుట చేయరు

ఈతగాళ్ళు అందుకు భిన్నముగా శుభ్రముగా తల (గుండు) గడ్డము నున్నగా గీయిస్తారు వంటిపై ఎక్కడ వెంట్రుక లేకుండా యుండాలి అనేది వారి నమ్మకము

బాల జిమ్నాస్టిక్ క్రీడాకారులు బొమ్మలను కౌగిలించుకొని ఆడ్తారు



క్రీడాకారుల నమ్మకాలు

హాకీ ఆటగాళ్ళు ఆటకు ముందు తమ స్టిక్‌ను గోల్ కీపర్ పిడ్స్ నకు కొడ్తారు

హర్డిల్స్ పోటీలో పాల్గొనువారు టీరు దూరపు పరుగు (లాంగ్ డిస్టెన్స్) క్రీడాకారులు కాఫీ స్కేటర్స్ నీళ్ళలో కలిపిన గ్లూకోజ్ త్రాగుతారు మారథాన్ పోటీలో పాల్గొనువారు తేనె తొనలు జంతికలు లాంటి ఫలహారాలు తింటారు

మరికొందరు ఎడమ కాలి మే జోడు షూ ముందు ధరిస్తారు ముందుగా కుడి కాలుకు ధరించరు కొందరు ఉడకబెట్టిన కోడిగ్రుడ్డు క్రీమ్ చూయింగ్‌గమ్ యిష్టపడతారు

## బ్రతికున్న చేపలు భుజించుటలో రికార్డు

లండన్‌కు చెందిన 16 ఏళ్ళ బాలుడు 501 గోల్డ్‌ఫిష్ తిని ప్రపంచ రికార్డు నెలకొల్పాడు అతని పేరు హార్ట్ అతను 501 గోల్డ్‌ఫిష్ చేపలను మూడు గంటలలో భుజించును అన్ని చేపలు బ్రతికినవి అయి యుండాలి అంతకు ముందు రికార్డు 400 చేపలు అయిదు గంటలు భుజించి నెలకొల్ప బడినది

# అవీ ఇవీ అన్నీ

## శ్రీ కొట్ర ఆదిశేషయ్య కాలధర్మం

ప్రముఖ స్వాతంత్ర్య యోధుడు పత్రికారచయిత శ్రీ కొట్ర ఆదిశేషయ్య మార్చి 23న నెల్లూరులో కాలధర్మం చెందారు ఆయన వయస్సు 85 సంవత్సరాలు భార్య ఒక కుమారుడు ఉన్నారు శ్రీ ఆదిశేషయ్య ఆంధ్ర పత్రికకు ఎ పి ఐ వార్తా సంస్థకు చాలా కాలం విలేఖరిగా పని చేశారు నెల్లూరులో గౌరవ మాజిస్ట్రేట్‌గా పని చేశారు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య గారి వద్ద పర్సనల్ అసిస్టెంటుగా శ్రీ ఆదిశేషయ్య పని చేసారు.



నెల్లూరు జిల్లా ఖిలాఫత్ కమిటి ప్రధాన కార్యదర్శిగా, ప్రదేశ్ కాంగ్రెసు సంఘం సభ్యుడిగా, నెల్లూరు జిల్లా కాంగ్రెసు సంఘం సభ్యులుగా ఉన్నారు. క్విట్ ఇండియా ఉద్యమంలో ఆయన అండర్ గ్రౌండ్ కార్యకర్తగా పని చేసారు.

## ఆచార్య రోణంకి అప్పలస్వామి అస్తమయం

బహుభాషా కోవిదుడు, మహాపండితుడు ఆచార్య రోణంకి అప్పలస్వామి మార్చి 28వ తేదీన టెక్కలిలోని తమ స్వగృహంలో మరణించారు ఆయన వయస్సు 77 సంవత్సరాలు భార్య



ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు ఉన్నారు.

ఆచార్య రోణంకి 1909 సెప్టెంబరు 15వ తేదీన జన్మించారు. ఆయన ఇంగ్లీషుతో సహా మరో 11 విదేశీ భాషలలో పాండిత్యం సంపాదించారు. మంచి విమర్శకులుగా పేరు తెచ్చుకున్నారు. విజయనగరం కళాశాలలో ఇంగ్లీషు ప్రొఫెసరుగా 1971 వరకూ మూడు దశాబ్దాలు పని చేసారు.

## తెలుగు సినిమా భక్తి పాటల పోటీలు

శ్రీ షిరిడీ సాయి సేవా సదన్ వారిచే 27-4-1987 న విజయవాడ రైల్వే ఇన్స్టిట్యూట్ హాలులో తెలుగు సినిమా భక్తి పాటల పోటీలు నిర్వహించబడును. ఇందులో గెలుపొందిన వారికి ప్రథమ బహుమతిగా బంగారు పతకములు పురుషులకు, స్త్రీలకు వేర్వేరుగా బహుకరించబడును. పాల్గొన దలచినవారు శ్రీ షిరిడి సాయి సేవా సదన్, రైల్వే కాలనీ, నెం. 672/సి, వించిపేట, విజయవాడ-1 చిరునామాకు తమ దరఖాస్తులు ఏప్రియల్ 22 వ తేది నాటికి పంపవలెనని సేవాసదన్ కార్యదర్శి శ్రీమతి మునగాల సరస్వతి తెలియజేస్తున్నారు. □

## ఉత్తరాలు

( 7 వ పేజీ తరువాయి)

### కథలు

20-26 మార్చి 87 "మాధవి" ముఖచిత్రంతో వెలువడిన సంచిక చాలా ఆకర్షణీయంగా ఉంది పుణ్యతిథి" "కోరిక తీరిన వేళ" కథలు చాలా బాగున్నాయి రచయిత్రులకు మా అభినందనలు

ఆచంటి శ్రీవల్లీదేవి పొందూరు

★ ★ ★

20-26 మార్చి. ఆంధ్ర సచిత్ర వార పత్రికలో అవధానుల విజయలక్ష్మిగారి కథానిక "పుణ్యతిథి" ఎంతో సహజంగా ఉన్నది పావని శాస్త్రిగారు తమ తండ్రిగారి పుణ్యతిథికొరకు ఎంతో శ్రమపడి కూడబెట్టిన వెయ్యి రూపాయలు అప్పుగాడి కొడుకు ప్రమాదంలో వున్నపుడు సాయంచేసిన సంఘటన రెండు కన్నీటిబొట్లు రాల్చేలా చేసింది రచయిత్రికి నా అభినందనలు

ప్రమోద్ అవధాని నిజామాబాద్

★ ★ ★

అందాల నటి మాధవి ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో శ్రీ కె ఎ ఎ సత్యనారాయణరాజుగారి వెల వెలబోయిన అద్దం కథ వాస్తవానికి అలా జరుగుతుందంటారా? అని అనుకోవచ్చు కిశోర్ లాంటి ఆదర్శవంతులున్నంతవరకు సమాజంలో కొంతమార్పు అయినా రావచ్చు. లావణ్య యొక్క ఆదర్శం కూడా బాగుంది భర్త పోయి వేరే ఆధారంలేని స్త్రీలను చేసుకోమని చెప్పిన లావణ్య శీలం దోచుకోబడిన ఒకస్త్రీని కిషోర్ చేసుకున్నేటట్టు చేసిన ఘనత లావణ్యదే ఎంతో ఎత్తుకు ఎదిగింది రచయితకు ధన్యవాదాలు

పోలోజు వెంకటాచారి హైదరాబాదు

### దర్మపథం

భగవంతుని గుణాలను నామరూపాలను కీర్తిస్తు, నిర్గుణ స్వరూపుడైన పరమాత్మను మన హృదయంలోనే నిలిపి ధ్యానించే విధముగ దర్మపథం"లో చాల చక్కగా వివరించే పూజ్యులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగార్కి నా హృదయ పూర్వక సలాములతో కృతజ్ఞతాభి వందనములు

యస్ ఎ సత్తార్ విజయవాడ

### వ్యాసాలు

20-26 మార్చి సంచికపై మాధవి ముఖచిత్రం అందంగా వుంది సునీల్ గవాస్కర్ చిన్ననాటి ముచ్చట్లు నానాటికీ పెరుగుతున్న ట్రాఫిక్ సమస్య ప్రత్యేక వ్యాసాలు ఆసక్తికరంగా వున్నాయి

-ఐరేని శ్రీనివాస్‌గౌడ్ రామాయంపేట □

## అమెరికాలో 'పేడ' విసురు పోటీలు

అమెరికావారు పేడ చేతితో ముట్టుకొంటారు అనేది మనలో అనేకులు నమ్మరు కాని ప్రతి ఏడు పేడ ముద్దలు విసురు పోటీలు జరుగును మనము క్రికెట్ ఫుట్‌బాల్ పోటీలు టి వి లో చూపించినట్లుగా యీ పోటీలను అమెరికన్ టి వి లో చూపుతారు 1961 ఆగష్టు 25 న మొదటిసారిగా యీ పోటీలు జరిగాయి ఎ బి ఎ అయివొట్నస్ న్యూస్ సర్వీస్ టి వి ప్రసారము చేసినది పెద్ద పెద్ద బకెట్లలో పేడ కొని రాబడినది కొందరు ఎండబెట్టిన పేడ తెచ్చుకొన్నారు ఎవరు ఎక్కువ దూరము విసురుతారు అనేది పందెము పోటీ చాలా ఆసక్తికరముగా యుండును చూచువారికి

'పేడ విసురు పోటీ'



సరదాగాకూడా యుండును

బి సి టి వి సంస్థకు పోటీసంస్థ అయిన ఎన్ బి సి టి వి సంస్థ తన రియల్ పీపుల్ (యదార్థ ప్రజలు) అనే శీర్షికలో మల మూత్రములు గల తొట్టిల బండ్లను వేగముగా త్రోయు పందెము చూపినది

అమెరికాలో పందెము అంటే పందెమే ఏవిధమైన పందెము అనేది అంత ముఖ్యము కాదు పందెములో విజేతలను యితర క్రీడా పోటీ విజేతలవలె గర్వముగా చెప్పుకుంటారు

-ముకరమ్

"త్రిమూర్తులు" షూటింగ్ సందర్భంలో అర్జున్, సమర్పకులు శ్రీ టి. సుబ్బరామి రెడ్డి

## "త్రిమూర్తులు" చిత్రానికి పెక్కు అందాల తారలతో పాట చిత్రీకరణ

చిత్తశుద్ధితో సాహసాలు చేసే వారు డబ్బుకు వెనుకాడరు. మహేశ్వరి పరమేశ్వరి పతాకంపై చిత్రాన్ని సమర్పిస్తున్న 'కళాబంధు' టి. సుబ్బరామిరెడ్డికి దైవశక్తి ఉంది. నిర్మాత పి. శశిభూషణ్‌కు యూనిట్‌శక్తి ఉంది. అందుకే అనితర సాధ్యమైన అపూర్వమైన నటీనటుల సమ్మేళనంతో మార్చి 22న ఒక బహుమతి ప్రదానోత్సవ సందర్భంలో హీరో వెంకటేశ్ పాడే సన్నివేశంలో కృష్ణ – విజయనిర్మల, శోభన్‌బాబు–విజయశాంతి, కృష్ణంరాజు – రాధ, చిరంజీవి– రాధిక, బాలకృష్ణ–భానుప్రియ, ఇంకా నాగార్జున, మురళీమోహన్, సుమలత, శారద, చంద్రమోహన్, వై. విజయ, జయమాలిని, అనూరాధ, సిల్క్‌స్మిత, గొల్లపూడి మారుతీరావు, డైరెక్టర్లు ఎ. కోదండరామిరెడ్డి, కోడిరామకృష్ణ

## సినిమా

(43 వ పేజీ తరువాయి)

పాల్గొనడం విశేషాకర్షణ. మార్చి 25 వరకు ఈ భారీ సెట్టింగ్‌లో జరిగిన చిత్రీకరణకు మూడు కెమెరాలు ఉపయోగించ బడ్డాయి. అంతకుముందు బ్యాంగ్‌కాక్‌లో, హాంకాంగ్‌లో పాటలూ, స్టంట్లూ వినూత్న రీతిలో చిత్రీకరింప బడ్డాయని టి. సుబ్బరామిరెడ్డి వివరించారు. నవయుగ ద్వారా జూన్ మొదటి వారంలో విడుదలయ్యే ఈ ప్రతిష్ఠాత్మక చిత్రంలో వెంకటేశ్, అర్జున్, రాజేంద్రప్రసాద్, శోభన, కుష్బూ, అశ్విని, రావుగోపాలరావు, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, సుధాకర్, బాలాజీ, నూతన్‌ప్రసాద్, రాంజీ, వీరభద్రరావు, రాళ్ళపల్లి, ధమ్, కె. కె. శర్మ, సుమిత్ర, కె. విజయ, మమత, అనిత, అనుపమ్ ఖేర్ ముఖ్య భూమికలు నిర్వహించారు. పరుచూరి సోదరుల రచన, ఆత్రేయ–వేటూరి గీతాలు, బప్పీలహరి సంగీతం, ఎస్. గోపాలరెడ్డి ఛాయ, భాస్కరరాజు శిల్పం, గీతా సుబ్బారావు ప్రచారం, విజయన్ సాహసాలు, శీను నృత్యాలు, పేకేటి శివరాం విదేశాలలో చిత్రీకరణ నిర్వహణ, ఆర్. పద్మనాభన్ ప్రొడక్షన్, నరసింహారావు కూర్పుతో కె. మురళీ మోహనరావు దర్శకుడు. □

"దయామయుడు"లో రమ్యకృష్ణ



Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar Vijayawada 520 003 Acting Editor M Madhava Rao Chief Editor S Radhakrishna
Phones Business 61247 61248 75569 Editorial 75667